# విషయసూచి

★ ఉపోద్ఘాతం

★ ముందుమాట .... i

1. మంత్రశాస్త్రం – పరిచయం .... 1

2. 'మంత్రమహార్ణవం' – ముఖ్యమైన మంత్రశాస్త్ర గ్రంథము .... 11

3. సిద్ధసాధ్య పరీక్ష .... 21

4. ఆసన సిద్ధి .... 31

5. దిగ్భంధన విధానము .... 39

6. మంత్రన్యాసము .... 47

7. పూజలో ముద్రల ఉపయోగం .... 57

8. మంత్రోపదేశ విధానము .... 61

9. మంత్ర-ముహూర్తం నిర్ణయము .... 69

10. మంత్ర పురశ్చరణ విధి .... 76

11. మంత్రశాస్త్ర ప్రయోగము .... 85

## I. మోక్ష-మంత్రములు

12. శ్రీమదష్టాక్షరీ మహామంత్రము .... 89

13. నారాయణ అష్టాక్షరీ మంత్రము .... 91

14. గాయత్రీ మహామంత్రము .... 93

15. వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రము .... 95

16. శ్రీ విష్ణు షడక్షరీ మంత్రము .... 97

17. శ్రీరామ తారక మంత్రము .... 100
18. శ్రీ దత్తాత్రేయ మంత్రము .... 102
19. సాలగ్రామ మంత్రము .... 104

## II. కామ్యక మంత్రములు

20. సంతాన-గోపాల మంత్రము (సంతానము లేనివారికి) .... 107
21. శ్రీ మహా గణపతి మంత్రము .... 119
22. శ్రీ విద్యా గణేశ మంత్రము .... 121
23. శ్రీ సుబ్రహ్మణ్య మహామంత్రము .... 123
24. శ్రీ కార్తికేయ మంత్రము .... 125
25. శ్రీ ధన్వంతరీ మంత్రము .... 127
26. వర-లాభకర రుక్మిణీవల్లభ మంత్రము .... 129
27. గరుడ పంచాక్షరీ మంత్రము (విషనివారణకు) .... 131
28. పరా సరస్వతీ మంత్రము (విద్యాప్రాప్తికి) .... 133
29. నీలకంఠ మంత్రము .... 135
30. మృత్యుంజయ మంత్రము (అపమృత్యు నివారణకు) .... 137

## III. సంపదనిచ్చే మంత్రములు

31. సౌభాగ్యలక్ష్మీ మంత్రము .... 139
32. మహాలక్ష్మీ మంత్రము .... 141
33. శ్రీకర లక్ష్మీ మంత్రము .... 143

*34.* లక్ష్మీ మహామంత్రము .... *145*

*35.* లక్ష్మీ మంత్రము .... *147*

## *IV.* జాతకంలో – గ్రహదోషనివారణా మంత్రములు

*36.* గ్రహన్యాసము .... *149*

*37.* రాశిన్యాసము .... *151*

*38.* నక్షత్ర–న్యాసము .... *153*

*39.* నవగ్రహ మంత్రములు

*(i)* భాస్కర మహామంత్రము .... *157*

*(ii)* సోమ మహామంత్రము .... *159*

*(iii)* అంగారక (కుజ) మహామంత్రము .... *161*

*(iv)* బుధ మహామంత్రము .... *163*

*(v)* బృహస్పతి మహామంత్రము .... *165*

*(vi)* శుక్రగ్రహ మంత్రము .... *167*

*(vii)* శనైశ్చర మంత్రము .... *169*

*(viii)* రాహుగ్రహ మంత్రము .... *171*

*(ix)* కేతుగ్రహ మంత్రము .... *173*

*40.* వ్యాధి మంత్రము (రోగ నివారణకు) .... *175*

## *V.* రక్షణ-మంత్రములు

*41.* శ్రీ నృసింహ మహామంత్రము .... *177*

*42.* శ్రీ సుదర్శన మహామంత్రము (శత్రుసంహారాస్త్రం) .... *179*

43. శ్రీ సుదర్శన నారసింహ మంత్రము .... 181
44. అఘోర నారసింహమంత్రము .... 183
45. జ్వాలా నృసింహమంత్రము .... 184
46. అష్టముఖ గండభేరుండ నృసింహమహామంత్రము .... 186
47. శ్రీ హనుమత్ మహామంత్రము .... 189
48. నారాయణ-అస్త్ర మంత్రము .... 191
49. నారాయణ కవచం .... 194
50. నారాయణీ ప్రత్యంగిరా-మంత్రము .... 197
51. శ్రీ వరాహ మంత్రము .... 199

## VI. జ్ఞానప్రద మంత్రములు

52. శ్రీ హయగ్రీవ మంత్రము .... 201
53. శ్రీ వేదవ్యాస మంత్రము .... 203
54. శివపంచాక్షరీ మంత్రము .... 206
55. శక్తిపంచాక్షరీ మంత్రము .... 208

## VII. భోగ మోక్షప్రద-మంత్రములు

56. శ్రీ వేంకటేశ్వర – పూజావిధానం! .... 211
మంత్ర-యంత్ర – జప రహస్యాలు
★57. గణేశ మంత్రములు (సర్వకామ ప్రదములు) .... 229
★58. సుదర్శన మంత్రములు (సర్వ రక్షాకరములు) .... 245

# ''మంత్రశాస్త్ర - రహస్యాలు !''

## ఉపోద్ఘాతము

మేము - **'హిందూమతం'**లో –B.Sc. మరియూ B.A.- డిగ్రీ కోర్సులు ప్రారంభించి, ఇప్పటికి మూడోసంవత్సరం నడుస్తున్నది !

ఇందులో బోధించేవి **''వేదాలలోని - సైన్సుల్ని''** (Vedic Sciences) మీరు ఒక క్రమబద్ధంగా చదువుకోటానికి **''పాఠ్యగ్రంధాలు''** (Text Books) గా తయారుచేసి ప్రచురించే ఉద్దేశంతో - **1. వాస్తుశాస్త్రం 2. ఆయుర్వేదం 3. జ్యోతిష–శాస్త్రాల**పై ఇంతవరకూ పుస్తకాలను ప్రచురించటం జరిగింది.

అనేకులు వీటిని శ్రద్ధాభక్తులతోకొని చదివి, ఆచరించటమూ జరుగుతున్న సంగతి, ఎంతో సంతోషకరమైన విషయం !

ఈ గ్రంథాలే 1. మీ ఇంటినిబట్టి అదృష్టము (వాస్తు) 2. ఆయుర్వేద–హృదయము ఇంకా ఇంగ్లీషులో 3. "Ayurveda - The Wisdom of Longevity" అన్నగ్రంథమూ 4. జ్యోతిషంలో - బాబిలోనియా జ్యోతిషం - అన్న గ్రంథాలూ మీకు ప్రచురించి అందించాము.

ఈ గ్రంథాలు - చౌకబారు గ్రంథాలమ్ముకునే బయట పబ్లిషర్లు- **'స్వలాభమే'** (స్వార్థమే) లక్ష్యంగా అనేక తప్పులతో అచ్చువేసి అమాయక హిందూవుల భక్తి విశ్వాసాల్ని దోచుకుంటూ వుండటమూ సరైన శాస్త్రీయమైన ప్రామాణిక పాఠ్యగ్రంథాలు లేకపోవటమూ, ఈ దుస్థితికి కారణం అని గ్రహించి - ఈ మీ **''వేదిక్ యూనివర్సిటీ''** ఈ ''గ్రంథాల–సిరీస్'' **(Vedic Sciences - Series)**ను ప్రచురణ చేపట్టింది!

ఇందులో ముఖ్యంగా - మంచిక్వాలిటీ పేపరూ, అందమైన అచ్చు, అతి తక్కువ ధరకు (ఈ పేపరు క్వాలిటీ కింకొకరు అందివ్వలేనంత ధరకు) ప్రింటు చెయ్యటమేగాక - ప్రతి శాస్త్రంలోనూ 1. అనేక ప్రాచీన సంస్కృత - శాస్త్రగ్రంథాల్ని చదివి వాటిసారం పిండి, అందులో సైంటిఫిక్‌గాను హాని చెయ్యని విషయాల్ని ఏరి సైన్సులాగా నేర్చుకోవటానికి తగు విధంగా వ్రాసి ప్రచురించాము. ఇది పండితులుకూడా ఆశ్చర్యం - సంతోషం పడిన విశేషం !

అంతేకాదు - సంఘంలోని కొందరు చీడపురుగుల వంటి **''చెదపురుగు''**ల్లాంటి చౌకబారు రచయితలు నా **''1999 - కలియుగాంతం''** గ్రంథాన్ని సిగ్గులేకుండా కాపీకొట్టి - తెలుగు కన్నడం ఇంగ్లీషులలో డబ్బు దండుకోవాలని ప్రజల్ని దోపిడీ చెయ్యాలనీ

మొదలుపెట్టిన **''సంఘ విద్రోహులను''** మీరు కనిపెట్టేవుంటారు- ఈ పాటికి!!! గ్రంథం పేరుకూడా కాపీకొట్టే అంత నికృష్ట నీచజాతి రచయితలకు చెప్పుదెబ్బ కొట్టి గుణపాఠం నేర్పటం పాఠకులైన మీ బాధ్యత !!!

ఎందుకంటే - ఇది ఒక **''యూనివర్సిటీ''** - **''వేదిక్-యూనివర్సిటీ''**గా రిజిష్టరు కాబడ్డ సంస్థ ! డిగ్రీకోర్సులను నడుపుతున్న బాధ్యతగల ఈ యూనివర్సిటీ ప్రచురణల్ని - పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్న దొంగ వెధవలను గుర్తించే వివేకం, పాఠకులకు లేకపోలేదని నిరూపిస్తారు మీరే! అందుకే పరిశోధనా (Research) దృష్టితో '**విద్యాప్రణాళిక** (Educational Policy) లో భాగంగా వేసే ఈ గ్రంధాలు, స్వార్థపరుల అనుకరణలు ఎంగిలితిని బ్రతికే కాపీచేసే రచయితల్నించి - ఎంతో ఎత్తున వుంటాయి !

ఇంకా మన **''వేదిక్ యూనివర్సిటీ''** ప్రచురణలు - **'హస్త-సాముద్రిక శాస్త్రం'** (పామిస్ట్రీ - Palmistry) మీదా యోగశాస్త్రం మీద - **''భగవద్గీత''** సారాంశాన్ని విద్యార్థులకు పాఠంగా మేము బోధించే సైన్సు రహస్యాల్నేరి - అన్నీ కలిసి **''వ్యాసగీత''** - అన్న గ్రంధంగా దీంతోపాటే అచ్చవుతున్నది. అలానే **''గణేశపురాణం''** (వ్యాసమహర్షి మూలమునకు - సరిక్రొత్త అనువాదంతో) అచ్చయింది !

**1999-కలియుగాంతం - III**

అన్నిటికన్నా అత్యంత ప్రమాదకరమైన సైన్సు రహస్యాలను 1999-కలియుగాంతం - III వ భాగంగా **''ప్రళయం''** అన్నపరిశోధనా గ్రంధం అచ్చులో వున్నది. కాపీకొట్టే రచయితలకు అందని పరిశోధనా

రహస్యాలెన్నో - ఈ "**ప్రళయం**" గురించిన సైన్సు రహస్యాలతో ఆధ్యాత్మి
విశేషాలతో పాఠకులకు ఈ "**యూనివర్సిటీ**" అందిస్తోంది !!!

మూకుమ్మడిగా మరణించి, సమాధి అయిన అనేక లక్షల జంతువుల
శవాల సైన్సు పరమైన సాక్ష్యాలుగా అందించే - "**సందేశ గ్రంథమే**"
ఈ "**ప్రళయం**"పై **1999 – కలియుగాంతం – III** భాగాన్ని మీకు
అందిస్తున్నాం.

ఇంకా - రాబోయే మా ప్రచురణల లిస్టు దీంట్లో విడిగా
చూడవచ్చు!

ప్రాచీన "**వేద – శాస్త్రాల**" (**Vedic Sciences**)ను విద్యారంగంలోకి
తేవటమే - ఈ "**వేదిక్ యూనివర్సిటీ**" సంకల్పం! దీక్షా !!!

**డా. వేదవ్యాస Ph. D**

ైదరాబాద్
1.1999

# ముందుమాట

'మంత్రశాస్త్రము' గురించి సమగ్రంగా తెలిపే గ్రంథాలు సామాన్యుడికి లభించడంలేదనే చెప్పాలి! అందువల్ల మన పాఠకులకు మంత్రశాస్త్ర రహస్యాలను తెలిపే రచన — దీన్ని మీకు అందిస్తున్నాను. స్వలాభం కోరని సంస్థగా **"వేదిక్ యూనివర్శిటీ — హిందూమతం"**లో B.Sc. డిగ్రీని ఇంకా B.A. డిగ్రీ కోర్సులను నిర్వహించి విద్యార్థులకు శిక్షణనిచ్చి వారికి **ఉద్యోగం గ్యారంటీ**కూడా ఇచ్చి 1994 నుంచీ ఉద్యోగం గ్యారంటీ యిచ్చే ఏకైక సంస్థగా పనిచేస్తున్న సంగతి అందరికీ తెలిసిన విషయం!

ఈ యూనివర్శిటీ అందజేసే **'ఋషివిజ్ఞానం'** లో ఇంతవరకూ — జ్యోతిషం గురించీ **వాస్తు**గురించీ, **నవగ్రహాలు అదృష్ట సంఖ్యల** గురించీ తేలికగా అర్థమయ్యే చిన్నచిన్న పుస్తకాలు అందించాను! కాని **'మంత్ర శాస్త్ర'** విషయంలో ఇంతవరకూ ప్రత్యేకంగా మన ప్రచురణ వెలువడలేదు! ఇప్పుడాలోటు తీరాలని ఈ రచన మీకు అందిస్తున్నాను **University of Vedic Sciences** సంస్థ తరపున.

**వేదమంత్రాల శక్తి :**

ఈ మంత్రాలన్నీ బీజాక్షరాలతోనూ, దివ్యశబ్దాలతోనూ, అపూర్వ శక్తినిచ్చే స్వరాలతోనూ నిండివున్నాయి. ఈ 'స్వరాలు' అనేకరకాల

ప్రకంపనలు (Vibrations) కలిగి అనేకమైన సిద్ధులను బయట ప్రకృతి మీద సాధించే శక్తినివ్వగలిగినవి. అందుకనే మంత్రానికి ఆ పవిత్రత! ఆ దివ్యశక్తి లోపించినందువల్లనే ఈకాలంనాటి మనిషి ఆ మంత్రాలను తయారుచేయలేడు. కృత్రిమత్వం పెరిగినందువల్ల 'యంత్రాల్ని' మట్టుకు తయారుచేయగలడు. ఇదీ ఈనాటి మానవుడు చేయగలిగిన పని.

ఆధ్యాత్మిక శక్తితో — దైవశక్తితో కార్యాలు సాధించేది 'మంత్రం' మనోబలంతో మనస్సుయొక్క యుక్తితో తద్వారా పుట్టిన ఆసక్తితో 'కార్యాలు సాధించేది 'యంత్రం' (యంత్రాంగం). వస్తుజాలంతోనూ, మంత్రజాలంతోనూ కూడా — ఈ రెండింటినీ కలిపి జోడించి, కార్య సాధన చేసేది "తంత్రం"! కేవలం భౌతికశక్తితో నడిచేవి యంత్రాలు (Machines)!! ఈ నాలుగురకాల విద్యలూ క్రమంగా చూస్తే ఋగ్వేద యజుర్వేద సామవేద అధర్వణవేదముల రహస్యాలలో క్రమంగా ఇమిడి వున్నాయి.

## సత్యమే మంత్రానికి ప్రాణం!

మంత్రం లేకుండా పూజ, జపము, దేవతా ప్రసన్నం, 'భగవత్సాక్షాత్కారము' అనేవి మానవుడు చేయలేడు! దానికి కావలసిన ఆధ్యాత్మిక శక్తి, ఇప్పటి ఈ మానవజాతికి లేదు. ఈ విషయం నిర్వివాదాంశం. దీనికి కారణాలు అనేకం ఉండవచ్చు. కాని ముఖ్యమైన కారణం మానవుడిలోని 'సత్యం' అన్న గుణం లోపించడమే! రెండవది మనిషి నిత్యజీవితంలో 'నైతిక ప్రవర్తన' నశించిపోవటము, లోభత్వంతోటే అన్ని పనులూ సాధించుకోవాలని చూస్తున్నాడు మనిషి! నిజానికి ధనదాహమో, కీర్తికాంక్షో లేక పదవి వ్యామోహమో కనీసం ఇతరుల మెప్పుకోసమనో, ఇలాగ, ఏ ఆశా లేకుండా ఏపని ఈరోజుల్లో దాదాపు ఎవరూ చేయరు. దీన్నే పూర్వం 'ధర్మం నశించడం' అన్నారు!

మంత్రాలలో రకాలు :

ఈ "మంత్రాలు" అనేక రకాలు. అందులో

1) **మొదటి తరగతి** : కష్టాలు నివారించడానికి. అంటే పాము మంత్రం, తేలుమంత్రం బెణుకుమంత్రం, మశూచి ("అమ్మవారు") మొదలైన రోగాలు నివారించడానికి, చిన్నపిల్లలకు దృష్టితగిలి (దీనినే "దిష్టి" అంటారు) పోరుపట్టి ఏడుస్తున్నప్పుడూ, ఇలాగ అనేకరకాల ఆపదలు నివారించడానికి పనికివచ్చే మంత్రాలు కొన్ని.

2) **ఇంక రెండవ తరగతి** : ప్రకృతి శక్తులకు సంబంధించినవి. అంటే సరైన వర్షం కురవడానికి అతివృష్టి, వరదలు, అనావృష్టి, కరువు నివారించడానికి, చక్కగా అన్ని ఋతువులూ ధర్మాన్ని తప్పకుండా ఆచరించడానికి పనికివచ్చే మంత్రాలు కొన్ని. యివి మనకు కనపడే భౌతిక ప్రకృతిలో నిగూఢంగా ఉండే శక్తులు — వీటినే "దేవతలు" అంటారు. వాటికి సంబంధించిన మంత్రాలు. ఈ దేవతలే ఇంద్ర, అగ్ని, యమ, వాయు, వరుణులు మొదలైనవారు. వీరు కంటికి కనపడకపోయినప్పటికీ, మన మనస్సు ఎలా పనిచేస్తున్నదో, మన గుండె ఎలా కొట్టుకుంటున్నదో, చెవులు ఎలా వింటున్నాయో, అలాగే నిశ్శబ్దంగా వాటి కర్తవ్యాన్ని అవే నిర్వర్తించుకుంటూవున్న ప్రకృతిలోని శక్తులకు అధిపతే యీ "దేవతలు".

3) **ఇక మూడవ తరగతి మంత్రాలు** : మానవుడి ఆధ్యాత్మిక పురోగతికి సంబంధించిన మంత్రాలు. ఇవి "గాయత్రి", "అష్టాక్షరి" దేవీ, శివ, సూర్య, విష్ణుసంబంధమైన దేవతాపరమైన మంత్రాలు. వీటి ఉపయోగం కేవలం మానవుడి మనస్సు వికసించడానికి, అతని బుద్ధి సరిగా పనిచేయడానికి అతనిలోని ఈర్ష్య, అసూయాద్వేషాలు వశంలో (Within Control) ఉంచడానికి పనికివస్తాయి.

## మంత్రాలు - దైవ సాక్షాత్కారం :

అంతేగాక నిస్వార్థంగా వీటిని హృదయ పూర్వకంగా అనుష్ఠించినట్లయితే మానవుడు భగవంతుడిని అనుభవ పూర్వకంగా తెలుసుకోగలుగుతాడు.

ఈ అనుభవం రెండు రకాలు.

1) **ప్రత్యక్షానుభవము :** అంటే ఈ మంత్రాలు ఉపాసించడంవల్ల భగవంతుడు అతనికి ప్రత్యక్షంగా గోచరిస్తాడు. దీనినే ప్రత్యక్షం లేక "సాక్షాత్కారం" అంటారు.

2) **ఇక రెండవరకం అనుభవం :** ఇది ఇంకా లోతైనది.

మొదటిది పంచదారను కంటితో చూసి ఆనందించడం లాంటిది. అది పైనచెప్పిన 'సాక్షాత్కారం' ఈ రెండవది ఆ పంచదారను నోటిలో వేసికొని అనుభవించి తనతో ఏకం చేసుకోవడం వంటిది. ఈవిధంగా భగవంతుడిని అనుభవించడం 'సాక్షాత్కారం' కన్న ఎక్కువమెట్టు. దీనినే 'భగవదైక్యము' అంటారు.

## 'మంత్రశాస్త్రం' - ఒక సైన్సు!

చాలామందికి **'మంత్రశాస్త్రం'** అనేది ఒక సైన్సువంటి క్రమబద్ధమైన — శాస్త్రమని తెలియక — ఎవరికి తోచినట్టు వారు ఏదో ఒక మంత్రాన్ని పట్టుకొని జపంచేసి, ఫలితాలు రాక — 'మంత్రాలకు చింత కాయలు రాలతాయా?' అన్న బుద్ధితక్కువ మాటలు మాట్లాడటానికి కారణం — మంత్రశాస్త్రంలో ఈ అజ్ఞానమే! అందువలన **మంత్రశాస్త్రం** ఒక సైన్సువంటి శాస్త్రం — కాబట్టి దానిని ఒక సైన్సువలే క్రమబద్ధంగా నేర్చుకోవాలి!



1

# మంత్రశాస్త్రం - పరిచయం

చాలామంది ఆధునికులమని అతిశయించేవారు వేదమంత్రాలకు అర్ధం తెలియకుండా వల్లించే బ్రాహ్మణపండితులను హేళనగా అర్ధం తెలియకుంటే మంత్రాలకి ఉపయోగం ఏమిటి? అని వాగుతూ వుంటారు! ఇది ఇంగ్లీష్ చదువుల దోషం! ఇంగ్లీష్‌వాడు అజ్ఞానంతో ఏది వాగినా దానిని మనవాడు అతిభక్తితో చిలకపలుకులుగా వల్లించడం మన ఈనాటి విద్యలక్షణమే యిది!

## 'మంత్రం' అంటే అర్ధం :

చాలామంది 'మంత్రం' అంటే ఏమిటి? అని అడుగుతారు! కొన్ని అక్షరాలతో కూడిన పదజాలం అని చాలామంది అజ్ఞానులు, స్వామీజీలూ సహితం సమాధానం ఇస్తూండడం — తరచూ మనకి కనిపిస్తుంది! సంస్కృతంలో 'మంత్రం' అన్న మాటకి అర్ధం ఏమిటంటే —

"మన్" = మనస్సును

"త్రాయతే" = రక్షించేది! — "ఇతి మంత్రః!"

మనస్సును రక్షించే పరికరమే మంత్రము! అయితే మనస్సును దేనినుంచి రక్షించాలి? అంటే అనేక రకములైన మానసిక దోషాలు — అనగా మనస్సు చాంచల్యము (మనస్సు గాలిలాగా క్షణకాలమైన స్థిమితంలేకుండా అటూ ఇటూ సంచరించే స్వభావంగలిగి, అనవసర విషయాల గురించి ఆలోచనలు, దిగుళ్ళు, వర్రీలూ పడే లక్షణం వంటివి అనేకం కలిస్తే మనోమయ దోషం — ఇలాంటి అనేక దోషముల నుంచి మనస్సును రక్షించేది — అని అర్థం, "మన్-త్రాయతే" అన్న మాటకు!

అలాగే మన చెడు-కర్మనుంచి మనల్ని — రక్షించేది కూడా మంత్రమే! ఎందుకంటే మనిషియొక్క బంధమోక్షములకు మనస్సేగదా? కారణం!

"మనయేవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః"

అని శాస్త్ర ప్రమాణం! కాబట్టి మన మనస్సును రక్షించేది మనలను బంధమోక్షములనుంచి రక్షించేది కూడా ఈ "మన్-త్రాయేతే" అనబడే మంత్రమే!

కాబట్టి మంత్రమే — మోక్షాపాయమని దీని నిర్ణయము!

మంత్రశాస్త్రమనగా ఇందులో ఏమి వుంటాయి? అన్న విషయం చాలామందికి అంతుపట్టదు! అందువల్ల చెప్పబోయే విషయాల్ని ఈక్రింద సంగ్రహంగా సూచిస్తాను!

* మంత్రములలో రకాలు — వ్యాపకములు, మహామంత్రాలు, కామ్యకములు — క్షుద్రములు!
* మంత్ర-బీజాక్షరాలు — శక్తి బీజాలు, జ్ఞాన బీజాలు తేడా —
* స్త్రీ-మంత్రములు, పురుష-మంత్రములు.
* ఏ మనిషి ఏమంత్రాన్ని జపించాలో తెలిపే మంత్ర-అర్వణం (మీ పేరునుబట్టి మంత్రాన్ని ఎన్నికచేసి నిర్ణయించే లెక్క)
* **మంత్రముహూర్తం** — మంత్ర విషయానికి కావలసిన జ్యోతిష విజ్ఞానము.
* గురువూ **మంత్రదీక్ష**, గురువు లక్షణాలు, గురువు బాధ్యతలు, శిష్యుని లక్షణాలు, శిష్యుని **నియమాలు!**
* మంత్ర **ఉపదేశ పద్ధతులు** — మంత్రదీక్ష, **మంత్రసిద్ధి**, మంత్ర **దేవతా** సాక్షాత్కారం — తేడాలు!
* జపవిధానం, జపించే స్థలములు — నదిలో, సముద్రంలో, గోశాలలో — దేవాలయంలో, స్మశానంలో, పూజా మందిరంలో, జలంలో నిలబడిచేసే **జపదీక్ష!**
* జపమాలల, రంగులు, వస్తువులు — మంత్రదీక్షా వస్త్రాల రంగు — తెలుపు, నలుపు, ఎరుపు, నీలం, ఆకుపచ్చ! ఏయే మంత్రాలకు ఏ రంగులు ఉండాలి!
* **జపవిధానం** — నిశ్శబ్ద **ఉపాంశు-జపము**, మనోజపము, బహిరంగ ఉచ్ఛారణా జపము!

★ **జపసంఖ్య** — హోమము, తర్పణము, భోజన సమారాధనకు — జపసంఖ్య, మంత్రసిద్ధి లక్షణము!

★ **మంత్రన్యాసము** — అంగన్యాసము, కరన్యాసము!

★ **మంత్రదేవతా** స్వరూపాలు, ధ్యానమూర్తి నిర్ణయము!

★ కలశస్థాపన, యంత్రము, ఆవాహన షోడశోపచారపూజ — నామ స్తోత్రపారాయణము, నైవేద్యము, నీరాజనం (హారతి), మంత్ర పుష్పము!

★ **దిగ్బంధం, దిగ్విమోకము.** కవచం కీలకం, అస్త్రం, ఋషి, ఛందస్సు అంటే వివరణ!

ఇందులో పైన సూచించిన విషయాలు కొన్ని మాత్రమే! ఇంకా ఎన్నో విషయాలు మంత్రశాస్త్రంలో అగాధమైనవి మహాసముద్రంలా వున్నాయి! ఇవన్నీ తెలిపే శాస్త్రమే ఈ — **'మంత్రశాస్త్రము!'**

మంత్రములలో **'కామ్యకములు'** అనగా కోరికలు సిద్ధించేవి, మోక్షదములు కోరికలేకుండా చేస్తే ముక్తినిచ్చేవి! **ఆకర్షణ** మంత్రములు, **విద్వేషణ** — మనుషులకు ద్వేషములు కలిగించేవి! **మారణం** (సంహారం చేసేవి) **ఉచ్చాటనము** ఊరువదిలి వెళ్ళిపోయేలా చేసే మంత్రక్రియలు, **మోహనము**, మతిభ్రమణం, **స్థంభనం** (బుద్ధి పనిచేయకుండుట) **మారణం** — సంహరించుట ప్రయోగము **ఉపసంహారము.** ఇవి రకరకాల మంత్రములకు పనిచేసే ముఖ్యాంశములు! తర్వాత అధ్యాయాలలో — ఈ శాస్త్రవిస్తారంగూర్చి క్రమంగా తెలుసుకుందాం!

అమూల్యమైన అతి ప్రాచీన-విద్య ఈ **మంత్రశాస్త్రం!** ఈనాడు మంత్రశాస్త్ర గ్రంధాలను పట్టించుకునేవారే లేరు! దీని గురించి తెలిపే సాహిత్యం — మహాసముద్రంలా ఎంతో వున్నది! అందులో సముద్రంలో **తేనెబొట్టు**లాగా కొంచెమైనా మీకు పరిచయంచేస్తాను!

**వేదము - వేదమంత్రాలు :**

'మంత్రశాస్త్ర' ప్రధాన సాహిత్యంలో ముఖ్యమైనవి **వేదాలు!** అతి ప్రాచీనమైన మంత్రాలు ఋగ్వేదకాలంనుంచీ ఈనాటికీ నిరంతరంగా క్రీస్తుపూర్వం 10,000 B.C. సంవత్సరాలనుంచీ ఈనాటివరకూ ఘనాపాఠి వేదపండితులచేత సుస్వరంగా అలానే వల్లించబడుతూ వస్తున్నాయి! అలాంటి ప్రసిద్ధమైన వేదమంత్రాలలో మొట్టమొదటిది (1) **గాయత్రీ మంత్రము** (2) **నారాయణ** మంత్రము (3) **శివపంచాక్షరీ** మంత్రం (4) **గణపతి** వేదమంత్రము.

ఇవికాక **మన్యుదేవతా** — సంబంధమైన **మన్యుసూక్తం, దుర్గాసూక్తం, పురుషసూక్తం, శ్రీసూక్త,** భూసూక్త — నీళాసూక్తములు, **నారాయణ** సూక్తం — ఇవీ, ముఖ్యంగా చెప్పుకోదగ్గవి!

వేదమంత్రాల విషయంలోకొస్తే — ప్రత్యేకించి వేదమంత్రాలలో అతిప్రధానంగా చెప్పబడింది '**నారాయణమంత్రం**'! ఇలా ఎందుకు చెప్ప వలసివస్తోందంటే ఈ మంత్రాన్ని కృష్ణయజుర్వేదంలోని 'ఉత్తర నారా యణానువాకం' లో అతి జాగ్రత్తగా ప్రత్యేకించి **మంత్రమూ**, మంత్రాక్షర ములూ, ఏమీ **బీరుపోకుండా** వేదాల్లోనే వర్ణించి **చెప్పిన** మంత్రాలు!

"ఓం — ఇత్యయగ్రే వ్యాహరేత్"

(ఓం అని ప్రథమంగా ఉచ్ఛరించాలి.) **నమ ఇతి పశ్చాత్** నమ

అని తర్వాత చెప్పాలి)

**'నారాయణాయేతి' ఉపరిష్టాత్**

(నారాయణాయ — అన్నమంత్రం ఆ తర్వాత చెప్పాలి)

"ఓం నమో నారాయణాయేతి" — **అష్టాక్షరాణి**

(ఓం నమో నారాయణాయ అన్న **ఎనిమిది** — అక్షరముల

గల **అష్టాక్షరీమంత్రం** జపం-చెయ్యాలి)

మంత్ర స్సర్వార్థసాధకః...

(...ఈ మంత్రం **సమస్త కోరికలనూ తీర్చునది** — అనగా అర్థము

కామము, జ్ఞానము, మోక్షమూ — సమస్తం ఇవ్వగల ఏకైక మంత్రం

అంటూ — ఈవిధంగా వేదాలు **మరి ఏమంత్రాన్నీ** ఇంతగా —

ప్రశంసించలేదు!

ఎందుకంటే ఇటు గాయత్రీమంత్రాన్ని అటు శివపంచాక్షరీ మంత్రాన్ని గురించి కూడా **ఇంతగా** వివరించని వేదం — నారాయణ మంత్రాన్ని వివరించింది. — "ఇది **అథర్వణ వేదమునకు శిరస్సు** వంటిది" అని వర్ణించింది!

"ఎవరైతే దీనిని ఉదయం, సాయంకాలమూ, శ్రద్ధతో ధ్యాన పూర్వకంగా జపిస్తారో — **వాడు విష్ణువే అవుతాడు**" — ఇది వేదమంత్ర శాసనం! (సవిష్ణురేవ భవతి — **స విష్ణురేవ, భవతి** ఇత్యుపనిషత్)

## మంత్రశాస్త్ర సాహిత్యం :

ఇది — ఇంతవరకూ వేదమంత్రాల విషయం! ఇక ఇతర మంత్రాల గురించి తెలిపే శాస్త్రంపేరే **'మంత్రశాస్త్రం!'** ఈ మంత్రశాస్త్రాన్ని తెలిపే సాహిత్యం ఒక మహాసముద్రం వంటిది! అందులో ముఖ్యమైన గ్రంథాలను సంగ్రహంగా మీకు పరిచయం చేస్తాను!

మంత్రశాస్త్ర గ్రంథాలలో ముందుగా చెప్పదగినవి — **'మంత్ర మహార్ణవం'**, రెండవది కల్పవృక్షంవంటి గ్రంథం శంకరాచార్య ప్రణీతమైన **'ప్రపంచ-సార సార-సంగ్రహం'**, మూలాన్ని మించిన మహత్తర వ్యాఖ్య రాసిన శ్రీశ్రీశ్రీ గీర్వాణేంద్ర సరస్వతీస్వామివారి — **'ప్రపంచ సార సార సంగ్రహం'** అద్భుతమైన వాఖ్య! ఇది స్వతహాగా స్వతంత్ర గ్రంథంకంటే ఎక్కువది! ఈ ప్రపంచ సార సారసంగ్రహం గురించి వివరంగా ఈక్రింద తెలియచేశాను!

## మంత్రశాస్త్ర గ్రంథాలు :

వీటిలో మంత్రశాస్త్రమునకు కల్పవృక్షం వంటిది! ఈనాడు కలియుగ ప్రభావంతో నష్టపోకుండా మంత్రశాస్త్రం ఏకొంచెమైనా నిలిచి వున్నదంటే ఈ **మంత్రమహార్ణవం, మంత్రమహోదధి, శారదాతిలక తంత్రము,** ప్రపంచ సార-సారసంగ్రహం-వంటి మహత్తరగ్రంథాలే మనకు ఏకైక శరణ్యం!

ఈ మంత్రమహార్ణవం గురించిన గ్రంధపరిచయం విడిగా ఈ అధ్యాయంలో తెలియచేస్తాను! ఇప్పుడు **ఇతర** — మంత్రశాస్త్ర గ్రంధాలేమిటో సంగ్రహంగా ఈక్రింద వివరిస్తాను.

1. అగస్త్య సంహిత
2. దత్తాత్రేయ తంత్రము
3. బీజ రావణ తంత్రము
4. గాంధర్వ తంత్రము
5. గౌతమీయ తంత్రము
6. దేవీయామళ తంత్రము
7. హరగౌరీ తంత్రము
8. హంసమాహేశ్వరీ తంత్రము
9. జ్ఞానార్ణవ తంత్రము
10. పురార్ణవ తంత్రము
11. కక్షకుటి తంత్రము
12. కులచూడామణి తంత్రము
13. కాళీతంత్రము
14. కౌతుకచింతామణీ తంత్రము
15. లలితా తంత్రము
16. కింకిణీ తంత్రము
17. మహార్ణవ తంత్రము
18. లింగార్చనా చంద్రిక
19. మాహేశ్వరీ తంత్రము
20. మాలినీ విజయతంత్రము
21. మంత్ర మహోదధి
22. మంత్రసిద్ధాంత భండాగారము
23. ముండమాలా తంత్రము
24. నారద పాంచరాత్రము
25. నారదీయ సంహిత
26. పురశ్చరణ చంద్రిక
27. పురశ్చరణ దీపిక
28. రుద్రయామళ తంత్రము
29. సమయా భారతి
30. శబ్దకల్పద్రుమం
31. సంస్కారభాస్కరం
32. సనత్కుమార సంహిత
33. శారదాసార సంహిత
34. శారదాతిలక తంత్రము
35. సిద్ధసార శ్లోకతంత్రము
36. శివాగమసారము
37. శివ జ్ఞానవిద్యా గ్రంథము
38. శ్రీ విశ్వసార తంత్రము
39. శ్రీ విశ్వరాజ తంత్రము
40. తంత్రసార తంత్రము

41. తంత్రసార సర్వస్వము
42. ఉచ్ఛిష్ట తంత్రము
43. ఉత్తర తంత్రము
44. వైశంపాయన సంహిత
45. వక్రతుండ కల్పము
46. రావణతంత్రము
47. విశ్వామిత్ర సంహిత
48. విశ్వామిత్ర కల్పము
49. వీర తంత్రము
50. యోగినీ హృదయము
51. యోగినీ తంత్రము
52. చాముండ తంత్రము
53. చంద్రపీఠ తంత్రము
54. దేవీ రహస్యతంత్రము
55. దుర్గాసప్తశతి
56. గంధర్వ తంత్రము
57. ఉపదేశ సుధ
58. సంస్కార భాస్కరము
59. శాంతిరత్నము
60. యోగినీ హృదయము
61. శౌనక సంహిత
62. అహిర్భుధ్న్య సంహిత
63. సనత్కుమార సంహిత
64. బీజార్ణవ తంత్రము
65. భైరవీతంత్రము
66. నారద పాంచరత్నం
67. వశిష్ట సంహిత
68. విశ్వామిత్ర సంహిత

పైన చెప్పిన తంత్రములేకాక **వేదవ్యాసమహర్షి** — ప్రోక్తమైన **'అష్టాదశ పురాణాలలో'** కూడా మంత్రశాస్త్ర రహస్యాలెన్నో ఇవ్వబడి వున్నాయి. ప్రతీ పురాణంలోనూ ఈ మంత్రాలు వున్నాయి. కాని ప్రత్యేకించి ఈక్రింది గ్రంధాలను విశేషంగా పేర్కొనవచ్చు!

మహాభారతం
ఆనందరామాయణం
భవిష్యపురాణం
బ్రహ్మపురాణం
దేవీభాగవతం
విష్ణుధర్మోత్తర పురాణం

| | |
|---|---|
| పద్మపురాణం | పద్మపురాణంలో రుద్రాక్షమహత్మ్యం |
| కూర్మపురాణం | స్కాందపురాణం |
| పరశురామ కల్పసూత్రాలు | విష్ణుపురాణంలో సాలగ్రామ మహత్మ్యం |
| సౌభరీమంత్ర సంవాదం | నారదపురాణం |

సంగ్రహంగా పైన చెప్పబడినవే ఇప్పుడు మనకు లభిస్తున్న మంత్ర శాస్త్ర గ్రంధాలు! ఇందులో కొన్ని ముఖ్యగ్రంధాలను గురించి విశేషంగా వివరాలతో పరిచయంచేస్తాను!



# 2

# 'మంత్రమహార్ణవం'- ముఖ్యమైన మంత్రశాస్త్ర గ్రంథము

ఇది ఒక సముద్రంవంటి అనేక మంత్రాల అపూర్వగ్రంథము! ఇది స్వతంత్ర గ్రంథమనేకన్నా ఎవరో పండితులు అనేక మంత్రశాస్త్ర గ్రంథాలను మథించి తయారుచేసిన సంకలనం వంటిది అని చెప్పవచ్చు! ఇందులోని విషయాలు సంగ్రహంగా చెప్పాలంటే — (1) ప్రథమ తరంగంలోని 626 శ్లోకాలలో గురుశిష్య సాంప్రదాయము, చతుర్యుగాల లోనూ యుగ ప్రభావాన్నిబట్టి ప్రత్యేకంగా పనిచేసే మంత్రాలు, ముద్రలు, న్యాస విధానము, హోమ విభాగము, పూర్ణాహుతి చేసేపద్ధతీ, యింకా అనేక దేవతల యంత్రములు, మాతృకా న్యాసము వర్ణించబడింది!

ముఖ్యంగా పంచాంగం యొక్క ఉపయోగమూ, ఏయే నక్షత్రాలు, ఏతిథులు, ఏయే మాసాలు వర్జనీయాలో, ఏదేవతలకు ఏవేవి శ్రేష్ఠమైనవో

— ఇంకా, షోడశోపచారపూజ, ఆసనపీఠ స్థాపన, **ఆవాహన**, **ప్రాణప్రతిష్ఠ** సంధ్యావందనా క్రమం — వంటి సంస్కారములు, **అగ్నిప్రతిష్ఠాపన** విధానం, హోమవిధానం, వంటివిఎన్నో, అన్నీ వివరంగా వర్ణించబడింది! ముందుగా గణేశునితో ఆరంభిస్తుందీగ్రంథం!

**గణేశ తంత్రము :**

ఈ తరంగంలో 29-అంశములు వివరించబడివున్నాయి. ముఖ్యం గా **గణపతిని** గురించిన **వక్రతుండ మంత్రము, ఉచ్ఛిష్ట గణపతి** విధానము, ఉపాసనకై నియమవిధానాలు చెప్పబడ్డాయి! **శక్తివినాయక పూజ, హరిద్రా గణపతి**, గణేశునియొక్క ఆరువేల-నామములు! వక్ర తుండ గణపతియొక్క 108-నామములు, వక్రతుండస్తోత్రము, ఉఛ్ఛిష్ట గణపతి సహస్రనామము, హరిద్రాగణపతి కవచం, **శక్తిగణపతి**, లక్ష్మీ వినాయక, త్రైలోక్యమోహనకర గణపతి యంత్రము — ఈ తరంగంలో ముఖ్యవిషయాలు!

మంత్రమహార్ణవంలోని తర్వాత తరంగం 16 అంశములను వివ రిస్తుంది! ముఖ్యంగా శివపంచాక్షరీ మంత్రప్రయోగ విధానం, దానికి చేయవలసిన ఆవరణ మంత్ర, యంత్ర, పూజ చెప్పబడింది! ఇంకా విశేషంగా **అష్టాక్షర శివమంత్రం** దానికి అవసరమైన ప్రయోగావరణ **యంత్రము** ఇంకనూ **త్ర్యక్షరీ మృత్యుంజయ** యంత్రము చెప్పబడింది! త్ర్యయంబక పూజాయంత్రము, **మహామృత్యుంజయ** పూజాయంత్రము, **దక్షిణామూర్తి** పూజాయంత్రము అన్నవి, ఈ తరంగంలోని ముఖ్యమైన విషయములు!

"త్ర్యయంబకం యజామహే" — అనబడే మంత్రమునకు చేయ వలసిన విధానం చెప్పబడింది! దక్షిణామూర్తి స్తోత్రము, సదాశివపూజ విశిష్టత ఈ తరంగంలో చెప్పబడ్డాయి! **'శివ అష్టాక్షరీమంత్రము'** — ఇందులో ఆసక్తికరమైన విశేషం!

దీనితర్వాత తరంగం **విష్ణుతంత్ర** ప్రధానమైనది! ఇందులో ముఖ్యంగా **విష్ణుద్వాదశాక్షర-మంత్రానికి** కావలసిన **యంత్రము,** లక్ష్మీ నారాయణపూజా యంత్రము, **విష్ణుమంత్రానికి యంత్రము,** శ్రీరామ, శ్రీకృష్ణ, మంత్రములూ, **హయగ్రీవ** పూజా యంత్రము, **నారసింహ యంత్రము** ముఖ్యమైనవి! ఆనంద రామాయణంలోని మనోహరకాంత శాతవితంలోని కొన్ని భాగాలు, ఇందులో పునరావృతం కాబడ్డాయి! ఈ తరంగంలో చెప్పిన విష్ణుమంత్రాలలో **దధివామనమంత్రం** ఆశ్చర్యకర మైంది! అలానే **భూ-వరాహమంత్రము,** నారసింహ కవచం, హయగ్రీవ పంజరము వంటి విశేషాలెన్నో ఈ తరంగంలో మనకి కనిపిస్తాయి!

**సూర్యతంత్రము :**

దీని తర్వాత భాగంలో **సూర్యతంత్రము,** సూర్యోపాసనా విధానం చెప్పబడింది! ముఖ్యంగా రామాయణంలో ఇవ్వబడిన **ఆదిత్యహృదయం** ఇందులో పునరావృతం కాబడింది! **భవిష్యపురాణంలో** చెప్పిన **సూర్య సహస్రనామావళి** శారదాతిలకంలోని **సౌరపూజావిధానం** ఇందులోని విశే షాలు కొన్నిమాత్రమే! ఈ ఖండంలో సూర్యోపాసన ప్రధానమైంది!

**హనుమత్ తంత్రము :**

మంత్రమహార్ణవంలోని తొమ్మిదవ తరంగం హనుమత్ పూజకు సంబంధించినది! ఇందులో ముఖ్యమైన 13-అంశాలు చెప్పబడ్డాయి!

అన్నీ హనుమత్ ఉపాసనకు సంబంధించినవే! ఇందులో విశిష్టంగా చెప్పినది హనుమత్ లాంగూలాస్త్ర మంత్రము, శతృంజయ హనుమత్ స్తోత్రము, పంచముఖీ ఆంజనేయ మంత్రము, **సువర్చలాదేవితో** కూడి **ఒంటెవాహనంపై** ఊరేగుతున్న **ఆంజనేయస్వామి** — ఇందులో వింతైన విశేషం!

హనుమత్ రామాయణం, ఆనందరామాయణంనుంచి సంగ్రహించిన **ఆంజనేయ పూజ,** విశేషాలూ, ఈ తరంగంలో ఇవ్వబడిన విషయాలు!

**వటుక భైరవ-తంత్రం :**

'పదియవ'-10వ తరంగంలో **వటుక భైరవోపాసనకు** సంబంధించినది. ఇందులోని విషయాలు కొన్ని రుద్రయామళ మంత్రం, శారదాతిలక తంత్రము, శివాగమ సారమువంటి గ్రంధాలనుంచి సేకరించబడినవి!

**మిశ్ర తంత్రము :**

ఇందులో అనేక సంకీర్ణ విషయాలు చెప్పబడినవి! అసంఖ్యాకమైన విషయాలలో కొన్ని ముఖ్యమైనవి: **కుబేర మంత్రము,** చంద్ర స్తోత్రము, కుజస్తోత్రము, గురుశుక్రాది నవగ్రహస్తోత్రములు విశిష్టమైనవి! ప్రత్యేకించి **వేదవ్యాసమహర్షియొక్క పూజావిధానము** గమనించదగ్గ విశేషం! **చిత్రగుప్త** మంత్రము, **కార్తికేయార్జునమంత్రము,** శతృఘ్న కవచము, శ్రీరామ, **భరత** మంత్రములు, లక్ష్మణమంత్రము, సీతామంత్రము, విశిష్టమైనవి!

"చరణాయతో" అనే పాదమే ఆయుధంగా — విష్ణుపాదమంత్రం చెప్పబడింది! హరివంశ పురాణపారాయణా ఫలితం, సంతానం లేనివారికి సంతానప్రదమని చెప్పబడింది! మరణించిన శిశువులు జన్మించే గర్భ దోషమున్న స్త్రీలకు గర్భ-రక్షామంత్రము చెప్పబడింది.

**విచిత్రం :**

ఈ అధ్యాయంలో ఇతర భాషలనుంచి అనగా ఉర్దూ, పారసీక భాషలలోని మంత్రాలుకూడా ఇవ్వబడ్డాయి. ఈ మంత్రమహార్ణవంలోని విషయాలు ఇటీవల కాలంవరకూ కొందరు ఇప్పటివరకూ కొత్తవిషయాల్ని చేర్చుతూ సంకలనంచేయడం జరుగుతూనే వస్తోంది — అని, దీన్నిబట్టి చూస్తే తేలుతోంది!

**దశమహా-విద్యలు :**

తర్వాత తరంగంలో ఇవ్వబడిన ముఖ్యమైన **దశమహావిద్యలు.** ముఖ్యంగా **కౌల,** కాపాలికా **వామాచార** పూజలు దీనిలో చెప్పబడి వున్నాయి. చాముండాతంత్రము, భవపూజామణి విశేషమైనవి! ఈ అధ్యాయంలో కన్యకాపూజ, వివాహిత అయిన గృహిణిపూజా వర్ణించబడింది! అలానే వామాచార పద్ధతిలో పంచ-**మకారములు,** మత్స్యం (చేపం) మాంసం, మద్యం, మంత్రం, మైధునం (స్త్రీతో సంభోగం) — మంత్ర సిద్ధికి చెప్పబడిన వామాచార పద్ధతులని గమనించబడినవి! వేదబాహ్యమైనవీ, శిష్టాచారులు విడువవలసిన నీచ క్షుద్ర ఉపాసనలుకూడా — దీనిలో వర్ణించబడినాయి!

అలాంటి వారిలో స్మశాన **ఉపాసనలు**, వామాచార, భైరవ, కాపా లికా కౌలవిధానాలు చెప్పబడినాయి! అమావాస్యనాడు రాత్రి స్మశా నములో చీకటిలో కాటుకపూసిన వస్త్రంధరించి అప్పుడే మరణించిన శవంపైన కూర్చుని చండాలస్త్రీతో పూర్తిగా మద్యంతాగించి దాని బహిష్టు సమయంలో దానితో సంసారంచేస్తూ చేసే జపం వర్ణించబడింది! ఒకే స్త్రీతో అనేక పురుషులూ, ఒకే పురుషుడితో అనేక స్త్రీలూ, కాపాలిక క్షుద్రవిధానములు కూడా ఇందులో చెప్పబడినవి! — ఇవి వర్జ్యములు వేదబాహ్యములు!

మిగతా తరంగంలో ముఖ్యమైనవి **కాళీతంత్రము**, పండగపూజ! **కాళీతంత్రంలో** చెప్పబడిన విషయాలు పునరావృతం చేయబడినవి! కాళికామంత్ర హృదయం, కాళీస్తోత్రమూ, కర్పూరాది స్తోత్రంలోని విషయా లను పోలివున్న **'రుద్రయామళ తంత్రం'** లోని కొన్ని విషయాలుకూడా చెప్పబడ్డాయి!

స్త్రీవశ్యము, వాక్సిద్ధి, ఆకర్షణీ విద్యవంటి లాభాలు ఈ కాళి పూజలో చెప్పబడ్డాయి! అలానే **తారా-తంత్ర, నీల సరస్వతీ** మంత్రము, "విద్యారాజ్ఞీమంత్రము", శ్రీమహావిద్యా విశేషాంశపూజలు ఈ అధ్యాయం లో చెప్పిన విశేషాలలో **షడక్షర సరస్వతీ** మంత్రము, కృష్ణ, దేవీ మంత్రము, సరస్వతీ మాలామంత్రము, సరస్వతీ యంత్రము, తారా తంత్రము, తారా సోత్రముతోపాటు — **బ్రహ్మపురాణంలోని సరస్వతీ సోత్రం** కూడా వర్ణించబడింది! పూజకు సరస్వతీ-యంత్రం చెప్పబడింది!

ఇతర విషయాలు సంగ్రహంగా ఇంకా ఇందులో చెప్పినవి శ్రీవిష్ణు తంత్ర త్రిపురసుందరీ మంత్ర త్రిపురభైరవీతంత్రం, భువనేశ్వరీ తంత్రము

ఛిన్నమస్తా తంత్రము, ధూమావతీ జపపూజ, బగళాముఖీ మాతంగీ కమలాకాంతా కుమారీ తంత్రము కాళిందీ తంత్రము వివరించబడింది! ఇందులో వసుధాలక్ష్మీ యంత్రము, అష్టదళపద్మ, మహాలక్ష్మీ యంత్రం, జపానికి కమలా మంత్రము, శ్రీసూక్తమునకు పూజాయంత్రము, పూజా విధానమూ చెప్పబడినాయి!

శ్రీసూక్తవిధానం ప్రయోగం 'విశ్వసారతంత్రం' లోంచి పద్మపురాణం లోంచి బ్రహ్మపురాణంలోనూ చెప్పిన విషయాలు ఇందులో కనిపిస్తాయి!

అలానే కాళికా తంత్రము, కాళీయసంహిత, కాళీ, యమునా శ్రీకృష్ణుల పూజా అర్చనస్తోత్రములు చెప్పబడ్డాయి!

**వామాచారం :**

కుమారీతంత్రంలో **'ఖర్జూర ఫలభోగినీ'** లేక **'ఖర్జూరాసవ సంవర్త'** అన్నచోట — ఇప్పటి గుజరాత్‌లోని **'ఖజురాహో'** దేవాలయంలో కని పించే **శృంగార శిల్పాలలోని** — తంత్రవిధానాలూ, కన్యకాపూజ, నవ కన్యకల పూజవంటి విశేషాలు చెప్పబడినాయి.

ఇందులో **వామాచార** పద్ధతిలో చేసే **దిగంబర స్త్రీపూజ** కూడా చెప్పబడ్డాయి! ఇవి శిష్టాచారులకు వర్జనీయములు! తర్వాత ఖండంలో **చేతబడికి** సంబంధించిన **ఆసురీ మహాకల్పము**, కాళరాత్రి తంత్రము, రుద్రయామళ, **విశ్వసార తంత్రము**లలోంచి ఎత్తిన విషయాలెన్నో — ఇందులో లభిస్తాయి! మోహన, వశీకరణ, ఉచ్చాటన, భ్రామణ మారణ-విధానాలు ఈ శక్తిపూజలో చెప్పబడినవి! **వార్తాళీ** మహిషాసుర మర్ధనీ, చేతబడికి సంబంధించిన **ఆసురీ మహాకల్పము**, **కాళరాత్రీ**

తంత్రము ప్రత్యేకంగా చెప్పబడినవి! కుక్షికాతంత్రము, రుద్రయామళ విశ్వసార తంత్రంలోంచి ఎత్తిన విషయాలూ ఇందులో లభిస్తాయి! మోహన వశీకరణ, ఉచ్ఛాటన, భ్రామణ మారణ విధానాలు ఈ శక్తి పూజలో చెప్పబడినవి! వార్తాళీ మహిషాసుర మర్ధనియేకాక, **చేతబడిని** సంహరించే — **శతృసంహారకమైన** విధానాలు కూడా ఇందులో వున్నాయి!

**యక్షిణీ–ఉపాసన :**

ప్రత్యేకించి **యక్షిణీ ఉపాసన** వివరంగా చెప్పే యక్షిణీ-తంత్రము, కలలో **ముందుగా** జరగబోయే విషయాలు తెలిపే **స్వప్నవారాహీ** వంటి స్వప్నసిద్ధి తంత్రము యక్షిణీ పూజావిధానం ఇందులో కనిపిస్తాయి! కొన్ని మంత్రాలు హిందీ మహారాష్ట్ర భాషలలోకూడా ఇవ్వబడినవెన్నో — ఈ ఉత్తరఖండంలో కనిపిస్తాయి!

**ఓషధీ ప్రయోగం :**

ఈ గ్రంథంలో విశేషం అనేక ఆయుర్వేదీ మూలికలయొక్క **మంత్రశాస్త్ర రహస్య** గుణాలు, వాటి సిద్ధి ఇచ్చే విశేషాలూ — చెప్ప బడ్డాయి. ప్రత్యేకించి, యక్షిణీవశం చేసుకొనే మంత్రం చెట్లక్రింద పూజ, విచిత్ర యక్షిణీ, 'భిక్షిణి', జనరంజని, మదనయక్షిణి అన్న విచిత్రాలుచేసే **మహిమలు చూపించే క్షుద్రశక్తులు** వర్ణించాయి! ఈ ఖండంలో చెప్పిన ఓషదులలో ముఖ్యమైనది **మదనకామేశ్వరీ చెట్టు!** 'భూతాంకుశం' మయూర-శిఖ వంటి మూలికలు చెప్పబడ్డాయి!

ఇంకా — **భూతడామర తంత్రము**, కింకిణీ తంత్రములనుంచి ఉద్ధరించబడిన కింకిణీ తంత్రముల వంటి విషయాలు ఇందులో లభిస్తాయి!

పుత్రదా అమ్ర, ధనదా, పిప్పలా, 'చంద్ర-ద్రవవాత', యక్షిణీ, బిల్వ యక్షిణి-పద్ధతులు ఈ ఔషధుల ప్రయోగంతో యక్షిణుల వశం చెప్పబడింది! ప్రతీరోజు తనను పూజించి — తనతో సంసారంచేసే వానికి ప్రతీరోజూ ఒక బంగారు నవరను ఇచ్చే యక్షిణీ పూజావిధానం చెప్పబడింది! ఈ యక్షిణితో ప్రతిదినం రాత్రి సంగమించితే — పై సిద్ధి కలుగుతుంది! దానికి నియమంగా — తన భార్య మరణిస్తుంది!

**దత్తాత్రేయ తంత్రము :**

కామాఖ్య మంత్రములు ధర్మన్ మంత్రములు ఈ ఖండంలోని కొన్ని విశేషాలు! దీని తర్వాతకాండ చేతబడి ప్రయోగ విధానాలు, జ్వాలాముఖీ, ఉచ్ఛిష్ట, ఛండాలీ, ఫేత్కరిణీ, రతిరాజ వంటి ప్రయోగాలు వివరించారు!

తైలమాతంగీ, ఇంద్రజాలము, విప్రవినోదులు చూపించే విచిత్ర మైన మహిమలు, వేపాకును చూపించి తేళ్ళను సృష్టించి, చేతికర్రను సర్పంగా మార్చి, నీళ్ళబొక్కెనలోంచి పొడి ఇసుకను తీయడం, మామిడి చెట్టువేసి అప్పుడే పండుకాసే విచిత్రాలు కొన్ని ఊడుగచెట్టు (అంకోలా బీజం తైలంచేసే కొన్ని ప్రక్రియలు వంటి — అసాధారణమైన రసాయన విచిత్ర మహిమలున్నాయి!

ఇందులో ఒక ఆకుపసరు చేతిలో పూసుకుంటే కణకణ మండే నిప్పుకణికలను చేతిలో కాలకుండా తీసుకువెళ్ళవచ్చు! అలానే ఇంకొక ఆకుపసరు నీటిలో పిండితే మామూలు ఉష్ణోగ్రతలో నీరు ఐసులా గట్టిపడి నీరు ఐస్-లాగ బంధింపబడుతుంది! ఇలాంటివి ఎన్నో చెప్ప బడ్డాయి!

పైన చెప్పిన విషయాలు మంత్రమహార్ణవం తెలిపే విశేషాలు! ఇవన్నీ చూడగా ఒకే ముఖ్యవిషయం కన్పిస్తుంది! ఈ గ్రంథం అతి ప్రాచీనమైనది కాదు! అనేక రకాల మంత్రగ్రంథాల సంకలనం శాస్త్ర సాంకర్యము (సంకలనం) చెందిన మంత్రశాస్త్ర విజ్ఞానం కలిగిన పుస్తక మిది! దీనికంటే ప్రపంచ సారసార సంగ్రహం అతి ప్రాచీనమైన విశిష్ట మైనది! కాబట్టి దాని గురించిన విశేషాలు మరికొంచెం విస్తారంగా మరో అధ్యాయంలో తెలుసుకుందాం!



3

# సిద్ధసాధ్య పరీక్ష

మంత్రపరీక్షలలో రెండవది — ఏమంత్రం మనకు సిద్ధిస్తుందో, ఏమంత్రం సిద్ధించదో తెలుసుకునే విధానం. అలానే సిద్ధించే మంత్రాలలో అతి సులభసాధ్యమైనదే, చాలా కష్టంమీద మాత్రమే సిద్ధించే మంత్రమేదో తెలియాలి! అదేవిధంగా అసాధ్యమంత్రమేదో, అతి తేలికగా సిద్ధిపొందే మంత్రమేదో తెలుసుకునే విధానం ఇప్పుడు మీకు తెలియజేస్తాను.

| | | | |
|---|---|---|---|
| 1 సిద్ధ సిద్ధం | 3 సిద్ధ సాధ్యం | 11 సాధ్య సిద్ధం | 9 సాధ్య సాధ్యం |
| 2 సిద్ధ అరి (శత్రువు) | 4 సిద్ధ స్వసిద్ధం | 12 సాధ్య అరి (శత్రువు) | 10 సాధ్య స్వసిద్ధం |
| 6 అరి సిద్ధం | 8 అరి సాధ్యం | 16 స్వసిద్ధ సిద్ధం | 14 స్వసిద్ధ సాధ్యం |
| 5 అరి అరి | 7 అరి స్వసిద్ధం | 15 స్వసిద్ధం అరి | 13 స్వసిద్ధ స్వసిద్ధం |

పైన చెప్పిన సిద్ధయంత్రములో 'అరి' అని వ్రాసిన గడిలో మంత్రం యొక్క మొదటి అక్షరం పడితే ఆ మంత్రం తనకు **శత్రువు!**

**'సాధ్యం'** అనివస్తే మంత్రం - **ప్రయత్నంమీద** సాధించవచ్చు!

**సిద్ధం, సాధ్యం** అనివస్తే - **ప్రయత్నంమీద** సిద్ధించును! ఇలాగ ఫలితాన్ని గ్రహించాలి!

దీనిని సిద్ధ-సాధ్య మంత్రపరీక్ష అంటారు.

ఈ సూత్రాన్నిబట్టి ఏ మంత్రానికైతే పై యంత్రంలో మొదటి గడిలోని **సిద్ధ-సిద్ధం,** అలాగే ఆఖరి గడిలో **స్వసిద్ధ-స్వసిద్ధం** అని ఫలితం వచ్చిన మంత్రం త్వరగా సిద్ధించును. శుభఫలితాలను ఇచ్చును! ఇది **మంత్రముహూర్త జ్యోతిష** విషయం!

**మంత్ర పురశ్చరణ :**

పైన చూపిన యంత్రములో మీపేరు, మంత్రపు మొదటి అక్షరం ఫలితం - **'సిద్ధ-సిద్ధం'** అన్న గడిలోవస్తే మంత్రము 'పురశ్చరణ' లేక 'జపించటం' మంత్రశాస్త్రంలో చెప్పిన సంఖ్య చేయగానే **సిద్ధించును** అని అర్థం!

అలాగే **'సిద్ధ-సాధ్యం'** అనే గడిలో మీపేరు మంత్రము పడితే మంత్రపురశ్చరణ మామూలుకంటే **రెండురెట్లు** సంఖ్యను జపించాలి!

అలాగే 'సిద్ధ-స్వసిద్ధ' అన్న గడిలో ఫలితంవస్తే మంత్రశాస్త్రంలో చెప్పిన సంఖ్యకు **సగం సంఖ్య** జపించగానే సిద్ధించును.

అదే విధంగా ఫలితం చూసేటప్పుడు గడిలో **'సిద్ధ-అరి'** అని వస్తే ఆ మంత్రం జపించగానే తన **కుటుంబ** సభ్యులకు నష్టం **మరణం** కలుగును!

మంత్రము, మీపేరు **సాధ్య-సిద్ధ** అన్న గడిలోవస్తే మంత్రపురశ్చరణ శాస్త్రంలో చెప్పిన దానికంటే **చాలారెట్లు ఎక్కువగా** జపం చేస్తేనేకాని **సిద్ధించదు** అని అర్థం!

అలాగే **సాధ్య-స్వసిద్ధ** అన్న ఫలితం వున్నచోట మంత్రము చెప్పిన ప్రకారంగా సంఖ్యను జపిస్తే **సిద్ధి** కలుగును!

మంత్ర ఫలితం **'సాధ్య-అరి'** అన్న గడిలో వచ్చిన మంత్రం జపిస్తే **దాయాదులు**, బంధువుల **వినాశనము** సంభవించును!

**స్వసిద్ధ-సిద్ధం** అన్న ఫలితం వున్నచోట మంత్రాన్ని శాస్త్రంలో నిర్దేశించిన సంఖ్యకంటే సగం **సంఖ్య జపిస్తేనే** చాలు!

**'స్వసిద్ధ-స్వసిద్ధం'** అన్న గడిలో ఏర్పడిన మంత్రం జపిస్తే **అతి త్వరగా సిద్ధి** కలుగును! దేవతానుగ్రహం వెంటనే లభిస్తుంది!

**'స్వసిద్ధ-అరి'** అని ఫలితం వచ్చినచోట **సేవకులు** అనుచరులు **మరణిస్తారు!**

**'అరి-సిద్ధ'** అని వచ్చిన మంత్రం జపిస్తే **తన కుమారుని మరణం** సూచించబడింది!

**'అరి-సాధ్యం'** అని ఫలితం వున్నచోట మంత్రం జపిస్తే **కుమార్తెకు** మరణం కలుగుతుంది!

అలాగే **'అరి-స్వసిద్ధం'** అన్న గడిలో వచ్చిన మంత్రం జపిస్తే **భార్య మరణిస్తుంది!**

చివరిగా హెచ్చరిక - **'అరి-అరి'** అన్న ఫలితంవున్న మంత్రం జపించగానే **జపించేవాడే మరణించును!**

పైన చెప్పిన **మంత్రసిద్ధి యంత్రము** కామ్యకములకు మంత్ర శాస్త్రంలో చెప్పబడిన మంత్రములకే వర్తించును!

కాని, **నారసింహ** మంత్రములు ఆదిత్య, సూర్య మంత్రాలు, **నారాయణ** మంత్రము, వరాహ మంత్రము, **గాయత్రీ మంత్రాలకు** పైన చెప్పిన **ఫలితం, యంత్రము వర్తించదు!** అవి వ్యాపక మంత్రములు - మోక్షమంత్రములుగా చెప్పబడినవాటికి పైఫలితం యంత్రంలో చూడ రాదు!

అంతేకాక **మోక్షమంత్రములకు** ఒకవేళ 'స్వసిద్ధ-స్వసిద్ధం' లేక 'సిద్ధ-సిద్ధం' అని ఫలితం వచ్చిన వారికి **భగవత్ సాక్షాత్కారం త్వరలో** కలుగును! మిగతా **చెడుఫలితాలేవీ** పై యంత్రములో రాయబడినవి ఈ **మోక్షమంత్రం విషయంలో పనిచేయవు!** ఇది **ముఖ్యగమనిక!**

ఇది సంగ్రహంగా **మంత్రజ్యోతిషం** యొక్క సారాంశంగా చెప్ప బడినది! ఇది జ్యోతిషశాస్త్రంలో చాలామంది పండితులకు కూడా తెలియని నిగూఢమైన జ్యోతిష శాఖ!

**మినహాయింపు :**

పైన చెప్పిన మూలమంత్రములోని బీజాక్షరములయొక్క **"సిద్ధ-సాధ్యపరీక్ష"** — నృసింహమంత్రమునకు, ఆదిత్య లేక సూర్యమంత్రము నకు, వరాహమంత్రానికీ ఇట్టి పరీక్ష చేయనక్కరలేదు! మోక్ష మంత్రము లలో గాయత్రీ, శ్రీమన్నారాయణ, వాసుదేవ, విష్ణుషడక్షరీ, గోపాల మంత్రములకూ, శ్రీరామ, ఆంజనేయ మంత్రములకు ఇట్టి పరీక్ష చేయ నక్కరలేదు!

అలానే "'ఏకాక్షర మంత్రములకు అనగా 'ఓం'కారము, సౌభాగ్య లక్ష్మీ ఏకాక్షరమంత్రమూ వంటి ఒకే అక్షరంకల్గిన మంత్రాలకు ఇలాంటి పరీక్షలేదు. సర్వులూ వాటిని నిస్సందేహంగా జపంచేయాలి! అదేవిధంగా

వేదంలోని మంత్రములకు — అనగా రుద్రనమకము, చమకము, పురుషసూక్త, నారాయణాష్టాక్షరీ మంత్రములూ ఇంక నవగ్రహశాంతిలో వినియోగించే వేదమంత్రాలకూ హంసమంత్రమునకూ (హంసగాయత్రీ), అదేవిధంగా శివపంచాక్షరీ మంత్రమునకు షోడశాక్షరీ మంత్రములకు ఈ మంత్రసిద్ధసాధ్య పరీక్ష చేయనక్కరలేదు" అని శాస్త్రవచనము.

నృసింహార్క వరాహాణాం ప్రసాద ప్రణవస్యచ ।
సపిండాక్షర మంత్రాణాం సిద్ధాదీన్ నైవశోధయేత్ ॥

ఏకాక్షరస్య మంత్రస్య మాలామంత్రస్య పార్వతి ।
వైదికస్యచ మంత్రస్య సిద్ధాదీన్నైవ శోధయేత్ ॥

హంసస్యాష్టాక్షరస్యాపి తథాపంచాక్షరస్యచ ।
స్వప్నలబ్ధస్య మంత్రస్య స్త్రియా దత్తస్య చైవహి ॥

నపుంసకస్య మంత్రస్య సిద్ధారీ న్నైవశోధయేత్ ।
ఏకద్వ్యిత్రయాది బీజస్య సిద్ధారీ న్నైవశోధయేత్ ॥

ఒక్కొక్కసారి సాధకులకు నిద్రలో స్వప్నములో కొందరు దేవతలు కనిపించి అనుగ్రహించిన మంత్రాలనుగాని లేక కలల్లో వాటంతటవే వినబడే మంత్రాలకుగానీ ఇట్టి శోధన చేయనవసరంలేదు. పరమాశ్చర్య కరమైన విషయమేమంటే తల్లినుంచి ఉపదేశం పొందిన మంత్రానికి గాని, సర్వశుభలక్షణములూగల సుమంగళిస్త్రీనుంచి పొందిన మంత్రానికి గాని ఇట్టి పరీక్షలు అవసరంలేదు.

ఇదేవిధంగా ఒకటి, రెండు, మూడు బీజాక్షరములు మాత్రమేగల మంత్రములకు — సిద్ధిశోధన చేయరాదు! నపుంసకమంత్రములకు,

మాలామంత్రమునకు, సపిండాక్షర మంత్రాలకు కూడా "సిద్ధ-అరి" శోధన అవసరంలేదు.

'అ'కారాది 'క్ష'కారము వరకూ వున్న అక్షరాలను మాతృకాబీజ న్యాస విధానంగా జపించేటప్పుడుకూడా, ఆఅనులోమ విలోమంగా క్లుప్తంగా మాలామంత్రంతో సంపుటిచేసిన మాతృకావర్ణములకు కూడా ఇట్టి శోధనలేదు.

సమస్త మంత్రములనూ మంత్రశుద్ధిచేయడానికి — 'శ్రీం' బీజం తోనూ, ప్రణవంతోనూ సంపుటిచేసి మంత్రాన్ని శుద్ధిచేసి జపిస్తే — దుష్టమంత్రమైనప్పటికీ లేక కొన్ని బీజాక్షరములు ఛిన్నమై వికలమైన మంత్రమైనప్పటికీ సిద్ధిస్తుందని శాస్త్రప్రమాణం!

**శ్రీ బీజంవా వినిక్షిప్య జపేన్మంత్రం విశుద్ధయే ।**
**తార సంపుటితో వాథ దుష్టమన్త్రోపి సిద్ధ్యతి ॥**

సమస్త మంత్రములకూ కామబీజాక్షరం (కామరాజ బీజము) **'హృల్లేఖా'** అనిచెప్పబడినది. అనగా హృదయంలోని ప్రాణచైతన్యం వంటిది.

**భూతకూట పరీక్ష :**

మంత్రాన్ని జపానికి స్వీకరించేముందు — 'అది మనకి సరిపోతుందా? అన్నివిధాలా పనిచేస్తుందా? — మన జన్మరాశికి, నక్షత్రానికి, మన పేరుకి ఏమాత్రం సరిపోతుంది?' అన్న పరీక్షలలో ముఖ్యమైనది "భూతకూటపరీక్ష".

**'భూతకూటపరీక్ష'** అనగా మంత్రంలోని అక్షరాలను పరిశీలించి, అచ్చులు, హల్లులు ఎలావున్నాయో విమర్శించి — ఇంకసూ ఏ బీజాక్ష

రమునకు పంచభూతాలలో ఏయేభూతం దానికి సంబంధించిన అధి భూతమై వున్నదో పరిశీలించి వాటి శత్రుత్వ, మిత్రత్వాలను తెలుసుకునే పద్ధతి, ఇది! ఇది ఎలా చేయాలో తెలియాలంటే మనం మాట్లాడే భాష అక్షరాలలో — 'పంచభూతాలకు' సంబంధించిన అక్షరాలు ఏవేవి ఉన్నాయో — పంచభూతాలలో ఏభూతం ఏ అక్షరానికి అధిభూతమైనదో తెలియాలి. దానికి ఈ చెప్పబోయే సూత్రాలు జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి.

ఈ ప్రపంచ సృష్టియావత్తూ పంచభూతాలతోనే సృష్టిజరిగింది. అంటే కేవలం బైట కనిపించే స్థూలప్రపంచానికి సంబంధించిన బైటి పంచ భూతాలే కాదు — మన శరీరంలో ఉండే రక్తమూ, మాంసమూ, శ్వాసా, శరీరంలోని వేడిమీ వంటివికూడా పంచభూతాలలో ఏయే తత్వానికి సంబంధించి ఏలక్షణం ఏర్పడివున్నదో అది పంచభూత సృష్టియొక్క క్రమాన్ని అనుసరించే ఉంటుంది. అంతేకాదు! మనం ఉచ్ఛరించే అక్షరాలలో కూడా కొన్ని అగ్నిసంబంధమైనవి (వీటి జపంవల్ల శరీరంలో వేడి కలుగుతుంది) అలానే మరికొన్ని బీజాక్షరాలు వాయుసంబంధమైనవి (శరీరానికి తేలికతనం వాయువులాగ చలనం ఏర్పడుతుంది. వాతగుణవృద్ధి ఔతుంది — ఉదా: హనుమత్ మంత్రము వాయుసంబంధము) బీజాక్షరాలలో పంచభూతాలకు సంబంధించిన అక్షరాలు పరస్పరం శత్రుత్వము, మిత్రుత్వాదులు, సమత్వమూ కలిగివుండును జ్యోతిషంలోని గ్రహాలలాగే! ఉదా: జలతత్వానికి సంబంధించిన బీజాక్షరాలు అగ్నితత్వ బీజాక్షరాలకు శత్రుత్వంలో ఉంటాయి. అలా ఎందుకూ అంటే — అగ్నీ, జలమూ (నిప్పు,

నీళ్ళు) ఒకదానికొకటి శత్రువులు గనుక, నీళ్ళు చల్లితే నిప్పు ఆరిపోతుంది గనక!

ఈ సూత్రాన్ని అనుసరించి మంత్రంలోని బీజాక్షరాలు కూడా ఆయా బీజాక్షరాలకు సంబంధించిన పంచభూతాలనుబట్టి 'మిత్రుత్వ, శత్రుత్వాదులు' ఏర్పడివున్నాయి. అవి తేలికగా తెలియడానికి ఒక పట్టిక (Table) రూపంలో ఈక్రింద చూపించాను.

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| **వాయువు** | **అగ్ని** | **భూమి** | **జలము** | **ఆకాశము** |
| అ | ఇ | ఉ | ఋ | |
| ఆ | ఈ | ఊ | ౠ | |
| ఎ | ఎ | ఓ | ఔ | అం |
| క | చ | ట | త | ప |
| య | ర | ల | వ | శ |
| ఏ | క్ష | ళ | స | హ |

| మిత్రత్వాదులు | శత్రుత్వ |
|---|---|
| భూ : జల | అగ్ని × జల |
| అగ్ని : వాయు | జల × అగ్ని |
| ఇంద్ర : వరుణ | వాయు × ఇంద్ర |
| | జల × వాయు |

పై చూపబడిన పట్టికలో పంచభూతాలకు సంబంధించిన తత్త్వాలను సూచిస్తూ నిలువుగా ఐదు కాలములు 1, 2, 3, 4, 5 వేసి 1 కాలములో వాయువు 2 క్రింద అగ్ని, 3 క్రింద భూమి, 4 క్రింద జలమూ, 5 క్రింద ఆకాశతత్త్వమూ చూపించాను. మంత్రంలోని అక్షరాలు పైపట్టిక ప్రకారం విడదీసి ఏయే బీజాక్షరం పంచభూతాలలో దేనితో ఏర్పడివున్నదో తెలుసుకోవాలి!

ఆతరువాత భూతత్త్వానికి జలతత్త్వ బీజాక్షరాలు మిత్రులు. అలానే అగ్నితత్త్వానికి వాయుతత్త్వము మిత్రత్వము. అదేవిధంగా శత్రుత్వాలు కూడా ఏర్పడివున్నాయి. ఇంద్రతత్త్వానికి శత్రుత్వం వాయుతత్త్వం. అలానే జలతత్త్వానికి వాయుతత్త్వం శత్రువు. అదేవిధంగా అగ్నితత్త్వానికి జల తత్త్వం శత్రువు. జలతత్త్వానికి తేజస్తత్త్వము శత్రువు.

కాని అన్ని తత్త్వాలకు ఆకాశతత్త్వం సమానము — అంటే శత్రువూ కాదు, మిత్రమూకాదు. దేవతలలో విష్ణుమూర్తికి (శ్రీమన్నారాయణునకు) నీలవర్ణము చెప్పడంవలన ఆకాశతత్త్వం సూచితము. అందువలన మహావిష్ణువు మంత్రము — జపంచేసే ప్రతివాడి శరీరంలోని పంచభూత తత్త్వా లకూ మిత్రమూకాదు, శత్రువూకాదు సమానమే!

పైనచెప్పిన పట్టిక ప్రకారం జపం చేయదలచిన మంత్రాన్ని పరిశీలించి తనపేరుకు విరోధంగాకాని పంచభూతతత్త్వంగల బీజాక్షరములున్న మంత్రాన్నే జపించాలి. అనుకూలతత్త్వంగల బీజాక్షరాలున్న మంత్రం బలాన్నిస్తుంది. శత్రుత్వంగల తత్త్వంగల బీజాక్షరాలున్న మంత్రం అనారోగ్యాన్నీ మనస్సుకు అస్థిమితత్వాన్నీ కలిగించి జీవితంలో యిబ్బందులూ, కష్టాలూ కలిగిస్తుంది. సమానత్వంలో ఆకాశతత్త్వంగల మంత్రము ఇటు

కష్టమూ, అటు లాభమూ కలిగించని సమాన ఫలితాన్నిస్తుంది. అంటే మన కర్మక్షయానికి ఏది అవసరమో అలానే జరుగుతుంది. ఈవిధంగా భూతకోటి పరీక్షలో మంత్రముయొక్క బీజాక్షరతత్త్వాలను పరీక్షించే విధానం మంత్రసార సంగ్రహము, ప్రపంచసారసారతంత్రము అన్న మంత్రశాస్త్ర ప్రమాణగ్రంధాలలో సిద్ధాంతీకరించబడివున్నది. ఇది తెలిసి దీని ప్రకారం మంత్రాలను జపించాలి.



4

# ఆసన సిద్ధి

మంత్రజపమునకు 'ఆసనసిద్ధి' ముఖ్యము. మంత్రజపమునకు పద్మాసనము సిద్ధాసనము శ్రేష్టమైనవి. పద్మాసనములో సవ్యపద్మాసనము (అనగా కుడికాలు ముందువేసేది) శ్రేష్టము. అది ఈ విధముగా చెప్పబడినది.

"ఎడమపాదము మణిచి కుడితొడపైన పెట్టవలెను. ఆ తరువాత కుడిపాదమును తెచ్చి మడతవేసి ఎడమతొడపై నిలపవలెను. తదుపరి రెండు మోకాళ్ళను దగ్గరికితెచ్చి పద్మ ముద్రలో బంధించి నిటారుగా కూర్చోవాలి!"

ఇది 'సవ్యపద్మాసనం'. కళ్ళు అరమూతలుగానుంచి దృష్టిని నాసా గ్రమునందు అనగా ముక్కుయొక్క కొనపైన నిలపాలి!

యోగాభ్యాస శిక్షణగలవారు కండ్లను నేలబారుగానుంచి — లోపలిదృష్టిని మాత్రము భ్రూమధ్యము లోపలిప్రక్క (అనగా రెండు కనుబొమల మధ్యకేంద్రము) నుదురులోపలినుండి చూస్తున్నట్లు మనస్సు

ను (కండ్లనుకాదు) కేంద్రీకరించాలి. ఈవిధంగా ఆసనస్థిరత్వము కలిగి తూర్పుముఖంగాకాని, ఉత్తరముఖంగాకాని (మోక్షవిద్యలకు) కూర్చోవాలి!

మంత్రము త్వరగా సిద్ధించవలెనన్న 'యోనిముద్రాసనం'లో కూర్చుండవచ్చు. దీనితో ఏమంత్రమైనాసరే ఖచ్చితముగా సిద్ధించును. 'యోనిముద్రాసనం' ఈవిధముగా చేయవలెను.

"ఎడమ మడమను భూమిపైనుంచి దానిపై మూలాధారము ఆనునట్లు కూర్చుండవలెను. ఆపైన కుడిమడమను లింగముపై నుండునట్లు (లింగము అడుగుభాగము అని మతాంతరము) కూర్చుని జపించిన అది 'యోనిముద్రాసనము' అగును."

**బాల-యవ్వన మంత్రాలు :**

బాలయవ్వన వృద్ధమంత్రములేవైనాసరే 'యోనిముద్ర ఆసనము' లో కూర్చుని జపించవలెనని — శాస్త్రము! వేరే ఆసనములో కూర్చుంటే సిద్ధించదు!

"సవ్యం పార్ష్ణిం గుదే స్థాప్య దక్షిణం చ ధ్వజోపరి ।
యోనిముద్రా బంధఏవం భవేదాసన ముత్తమం ॥

యోనిముద్రాసనే స్థిత్వా ప్రజపేద్యస్సమాహితః ।
యంకశ్చిదపి వా మంత్రం తస్యస్యు సర్వసిద్ధయః ॥
ఛిన్నారుద్ధాః స్తంభితాశ్చ కీలితా మూర్ఛితస్థా ।
సుప్తామత్తాహీనవీర్యాదుగ్ధాః ప్రస్తారిపక్షకాః ॥

బాలాయౌవన మత్తాశ్చ వృద్ధామంత్రాశ్చయేమతాః ।

యోనిముద్రాసనేస్థిత్వా మంత్రానేవం విధాన్ జపేత్ ॥

తస్యసిద్ధయంతి తే మంత్రా నాన్యస్యతు కథంచన । ఇతి ।

**మంత్రముల విభజన :**

శారదాతంత్రమున మంత్రములు జాతులనుబట్టి స్త్రీమంత్రములు, పురుషమంత్రములు, నపుంసకమంత్రములని — మూడువిధాలుగా చెప్పబడివున్నాయి.

**పురుషమంత్రాలు :**

ఏమంత్రమునకైనాసరే చివరిలో 'హుం' అనుశబ్దము, 'ఫట్' అన్న పదముతో మంత్రము అంతమైతే అవి పురుషమంత్రములని తెలియవలెను. ఉదా: సుదర్శనమహామంత్రము — 'సహస్రార హుంఫట్' అనునది.

**స్త్రీమంత్రములు :**

మంత్రము చివరలో 'ఠ' అను బీజాక్షరము రెండుసార్లు వచ్చిన పక్షంలో అది స్త్రీమంత్రము అని తెలియవలెను. ఉదా: 'వజ్రవారాహీ... ఠఠ'.

**నపుంసకమంత్రములు :**

ఏమంత్రానికైనాసరే మంత్రము చివర నమో అనే శబ్దంకనుక వస్తే — అది నపుంసకమంత్రము అని తెలియవలెను.

## దుష్టమంత్రములు :

మంత్రములు దోషములు గలిగిన వాటిని దుష్టమంత్రాలంటారు. అనగా 1) ఛిన్నమంత్రము 2) వ్యర్థమంత్రము 3) శక్తిహీనము 4) పరాఙ్ముఖమంత్రము 5) బధిరమంత్రము మరియు 6) అంధ లేదా నేత్రహీనమంత్రము 7) ఈరితము 8) స్థంభితమంత్రము అని పై ఎనిమిది రకములైన దోషములు కల్గిన మంత్రములు దుష్టమంత్రము లని చెప్పబడినవి.

బీజాక్షరము మంత్రములో ఉండవలసినది నష్టపోతే అది 'సిద్ధి హీనమంత్రము', ఇది హీనమంత్రమని కూడా పిలువబడుతున్నది.

అలానే 1) ధూమితము 2) ఆలింగికము 3) మోహితము 4) క్షుధార్తము 5) అతిదృక్తము 6) అతికృద్ధము 7) అంగహీనము 8) అతిక్రూరము 9) శాంతమానసము అనే దోషాలుగల మంత్రాలు స్థానభ్రష్టుత్వం కలిగించును.

## స్వరాక్రాంత మంత్రము :

ఏ మంత్రములోనైనా మూడుసార్లు మళ్ళీమళ్ళీ ఒకేశబ్దము వృత్తమై తిరిగితే అది 4 లేక 5 సార్లు పునరావృత్తి జరిగితే అది స్వరాక్రాంత మంత్రమని అందురు. ఉదా:

"అఘోరేభ్యో త హ్రాం ఘోరేభ్యో హ్రీం
ఘోరఘోరతరేభ్యశ్చహ్రూం సర్వేభ్యో శర్వసర్వేభ్యహ్రైం
సమస్తే అస్తురుద్రరూపేభ్యో హ్రౌం"

— ఇది స్వరాక్రాంత మంత్రమునకు ఉదాహరణ.

**జపవిధానము :**

మంత్రజపమునకు సాధకుడు ధరించవలసిన వస్త్రములు ఏ రంగులో వుండాలి? ఏయే మంత్రములకు ఏరకములైన వస్త్రములు ధరించాలి? అన్న మంత్రశాస్త్ర నియమం తెలియక జపిస్తే మంత్రము నిష్ఫలమౌతుంది. లేదా వ్యతిరేక ఫలితాన్నిస్తుంది. కాబట్టి మంత్రానికి సరియైన వస్త్రాన్నే ధరించాలి!

అభిచారిక మంత్రములకు — అనగా ప్రయోగ, చేతబడి, సంహారక మంత్రములకు ముదురు నీలంరంగు వస్త్రం ధరించాలి.

ఉదా: 1) బగళాముఖీ మంత్రము 2) రక్తకాళీ మంత్రము 3) నారాయణప్రత్యంగిరామంత్రము వంటివి సంహారకములు. వీటికి నీలవస్త్రము చెప్పబడినది.

వశ్యాది మంత్రములకు అనగా యితరులు తనకు అనుకూలముగా చేసుకునే మంత్రములకు ఎఱ్ఱని కుంకుమపువ్వురంగు పట్టు వస్త్రాన్ని ధరించాలి. అలానే 'సంహారకరం' (అనగా ఇతరులు చేసిన ప్రయోగాన్ని సంహరించడానికిగాని, ఆవ్యక్తిని సంహరించడానికికాని జపం చేసే మంత్రమునకు) పసుపుపచ్చని పట్టువస్త్రం ధరించాలి. పసుపు పచ్చని పూలతో పూజించాలి. పసుపునే పూజాద్రవ్యంగా వాడాలి. ఎందుకంటే పసుపువర్ణం సంహారకం!

ఉదా: బగళాముఖీ మంత్రాన్ని జపించువాడు పచ్చని పట్టువస్త్రం ధరించాలి! మోక్షమంత్రములు, జ్ఞానవృద్ధికరములు, రాజ్యలాభంకోసం చేసే మంత్రాలకు మల్లెపూవు వంటి ఉతికిన బట్ట ధరించాలి. పరమాత్మ దర్శనం కోరినవారు భగవత్సాక్షాత్కారం కోసం చేసే జపానికి బంగారు

జరీవంటి రంగుగల పట్టుపీతాంబరం ధరించాలి! ఉదా: శ్రీమన్నారాయణ మంత్రము, గాయత్రీమంత్రము, సౌరాష్టరి వంటివి — మరియూ వేద పారాయణము (డబ్బులు తీసుకుని పారాయణకుకాదు!)

## ఆసన నియమం :

జపం చేసేటప్పుడు కూర్చొనవలసిన ఆసనమునకు చెప్పబడ్డాన నియమములు, మంత్రశాస్త్రము 'గరుడకల్పము'లో చెప్పబడిన ప్రకారము ఈవిధంగా చెప్పబడింది.

(1) దర్భాసనంపై కూర్చుని జపిస్తే — తపస్సు వృద్ధి అవుతుంది.

(2) రత్నకంబళంమీద కూర్చుని జపిస్తే — సంతానవృద్ధి కలుగును.

(3) పర్వతశిఖరంమీద కూర్చుని జపిస్తే — మంత్రములో స్పందనకలిగి ప్రాణశక్తిపుట్టి తపస్సిద్ధి కల్గును.

(4) అలానే ఆశ్రమభూమియందు లేక దేవాలయ ఆవరణలో తూర్పు లేదా ఈశాన్యపు దిక్కుగా కూర్చుని జపిస్తే పుణ్యము, దేవతానుగ్రహము కలుగును.

(5) అలాగే ఇంటిలో కూర్చుని జపించే మంత్రమునకు ఒకమెట్టు ఫలితము, (ఎంత జపంచేస్తే — అంతే ఫలం) కలుగుతుంది.

(6) అదేవిధంగా ప్రవహించే జీవనదిలో నడుంవరకూ నీళ్ళలో నిలబడి బొడ్డుకు జలం తగిలేలాగ జపిస్తే జపసంఖ్యకు రెండురెట్లు ఫలితం లభిస్తుంది.

(7) గోవులయొక్క గోశాలయందు కూర్చునిచేస్తే జపసంఖ్యకు నూరు రెట్లు ఫలితమిస్తుంది.

(8) అగ్నిహోత్రం లేక యజ్ఞంచేసిన యజ్ఞశాలలో కూర్చునిచేస్తే నూరింతల ఫలితం లభించును.

(9) సిద్ధక్షేత్రములోగాని, సహజంగా దేవత వెలసిన సాక్షాత్కార తీర్థములోగాని, దేవతామూర్తికి ఎదురుగాకాని, లేదా ముఖమంటపంలో ఈశాన్యపు దిక్కుగాకాని, కూర్చుని జపిస్తే వెయ్యిరెట్లు, కోటిరెట్లు అని, అనంతఫలము విష్ణుదేవాలయములో కూర్చునిచేస్తే కల్గుతుంది.

దర్భాసనే తపోవృద్ధిః ప్రజావృద్ధిస్తురత్నకే ।
గిరిగోష్ట పరిస్పందన ధారణ్యాశ్రమహృదాః ॥

దేశాః పుణ్య జపస్యైతే యత్రవారోచతేమనః ।
గృహేత్వేకగుణం జప్యం నద్యాంతు ద్విగుణంభవేత్ ॥

గవాంగోష్టే శతగుణం అగ్న్యాగారే శతాధికం ।
సిద్ధక్షేత్రేషు తీర్థేషు దేవతాయాశ్చ సన్నిధౌ ॥

సహస్ర శతకోటిః స్యాదనంతం విష్ణు సన్నిధౌ ।
అశ్వద్ధమగ్నిమాదిత్యం బ్రాహ్మణానాం దేవమందిరం ॥
నదీం జలాశయంచైవ పృష్టకృత్సం జపేన్నతు ॥ ఇతి

సూర్యస్యాగ్నేర్గురోరిందో ర్దీపస్యచ, జలస్యచ ।
విప్రాణాం చగవాం చైవ సన్నిధౌశాస్యతే జపః ॥

**నిషేధము :**

జపంచేసేవారు ఎట్టి పరిస్థితిలోనూ తాను జపం చేస్తున్న వైపుకు వెనుకగా నది ప్రవహించేలాగ కూర్చుని జపించరాదు — అలానే

రావిచెట్టు వీపువెనుకగా వుండినా, లేక అగ్నిహోత్రమునకు వీపుత్రిప్పి కూర్చున్నా, అదేవిధంగా దేవాలయంవైపు వీపుపెట్టి లేదా స్వామిపుష్కరిణీ వైపు వీపుఉండేలా కూర్చున్నా ఆ జపం సిద్ధించదు! విఘ్నములు కలుగుతాయి. రోగము, మరణము సంభవించవచ్చు!

మంత్రదేవతార్ధ ప్రకాశిక గ్రంధంలో జపవిధానం గురించి వర్ణిస్తూ "సూర్యునికి అభిముఖంగాకాని, గురువునకు ఎదురుగా కూర్చునిగాని, విష్ణుభగవానుని విగ్రహమునకు తూర్పుదిక్కుగాగాని జపించినా, లేక దీపారాధనకు అభిముఖంగా, జలాశయం, నది, పుష్కరిణి, బావి, గోవు, వేదపండితుడైన బ్రాహ్మణుడు తనకు తూర్పుగావుండేలా కూర్చుని చేసే జపము ప్రశస్తమైన ఫలితమిస్తుంది. త్వరలో మంత్రసిద్ధి కలుగుతుందని చెప్పబడింది. ఇది జపనియమాదుల విధానము. ఇప్పుడు జపారంభము నకు చెప్పబడిన నియమాలు తెలుపబడినవి.



5

# దిగ్భంధన విధానము

ముందు చెప్పబడిన విధంగా శిష్యుడు జపారంభమునకు పద్మాసనము, స్వస్తికాసనము, సిద్ధాసనములలో దేనిలోనైనా నిష్ఠగా కూర్చుని — ముందుగా జపవిఘ్నములు కలుగకుండా దిగ్భంధన విధానము ప్రకారం ఈక్రింద చెప్పిన విధముగా దిగ్భంధన చేయాలి. ముందుగా 3 ప్రాణాయామములు ఓంకార సహితంగాచేసి గురుబ్రహ్మ మంత్రముతో గురువందనంచేసి — గురువును పరబ్రహ్మస్వరూపంగా భావనచేసి మనసా, వాచా, కాయేన (శరీరంతో) గురువుకు శరణాగతిచేసి సాష్టాంగ నమస్కారం చేయాలి. ఈ శరణాగతి ఎంత చిత్తశుద్ధితో చేస్తే అంత త్వరగా మంత్రసిద్ధి లభిస్తుంది.

ఈవిధంగా గురువందనమాచరించి ముమ్మారు గణపతిని స్మరించి (శుక్లాం, భరధరం, విష్ణుం...) తో....

1) **"ఓం శ్రీ గురుభ్యోనమః"** — అని తలపై సహస్రారంమీద నమస్కరించాలి. ఊర్ధ్వ దిగ్భంధన చేస్తూ.

2) **"ఓం గూం గురుభ్యోనమః"** — అని కుడివైపు ఛాతీమీద నమస్కరించాలి. దక్షిణదిగ్భంధనం చేయాలి.

3) **"ఓం గం గణపతయేనమః"** — అని ఎడమవైపు రొమ్ముపై నమస్కరించి దక్షిణదిక్కును బంధించాలి.

4) **"ఓం దుం దుర్గాయైనమః"** — అని ఎడమతొడపై దిగ్భంధనం చేసి

5) **"ఓం క్షం క్షేత్రపాలాయైనమః"** — అని కుడితొడపై దిగ్భంధన చేయాలి.

6) **"ఓం సం సరస్వతయై నమః"** — అని తన ముఖమునకు పూర్వ దిగ్భంధనం చేయాలి.

7) **"ఓం పం పరమాత్మయై నమః"** — అని హృదయమునందు దిగ్భంధనచేసి పైనచెప్పిన మంత్రముతోనే దిగ్భంధన విధానాన్ని పై

8) కుడిచేతియందు చీలమండలంనుండి ప్రారంభించి సుదర్శనాస్త్ర మంత్రంచేత (వైష్ణవ సాంప్రదాయ దేవతలను పూజించే సమయం లోనూ) అలానే శైవసాంప్రదాయ దేవతలను పూజలో పాశుపతాస్త్ర మంత్రంతోనూ ఈరెండూకాని దేవతల పూజలో బ్రహ్మాస్త్రమంత్రంతో న్యాసంచేయాలి.

సుదర్శనాస్త్ర మంత్రము ఓం క్రైాం సహస్రారహుం ఫట్' — అని చేయాలి.

శైవసాంప్రదాయ జపమునకు పాశుపతాస్త్రమంత్రముతో చేయాలి. ఈ పాశుపతాస్త్రమంత్రమునకు వామదేవఋషి — పంక్తిఛందస్సు — పశుపతిర్దేవతా — "ఓం క్లీం పశుగుంఫట్" అని మంత్రము.

బ్రహ్మాస్త్రమంత్రమునకు — "ఓం తపశ్శ్యాత్మనై హస్త్రాయఫట్" అని చేయాలి.

తూర్పుదిక్కున ఇంద్రునితో ప్రారంభించి ప్రదక్షిణ పూర్వకంగా తనచుట్టూ అష్టదిక్కులకూ దిగ్భంధన చేయాలి — **"మాం రక్షాం కుర్యాత్"** అని! **"ఐం ద్రీం ఇంద్రాయనమః"** అని ఇంద్రునికి **"ఓం వం వారుణేనమః"** అని వాయుదేవుని, **"ఓం రం అగ్నయే నమః"** అని అగ్నిదేవునకు **"ఓం షం షమాయ నమః"** అని యమునకు, **"ఓం వం వరుణాయనమః"** అని వరుణదేవతకు, **"ఓం యం వాయవే నమః"** అని వాయుదేవతకు, **"ఓం బ్లూం కుబేరాయనమః"** అని ఉత్తర దిక్కునకు.

ఈవిధంగా అష్టదిక్కులను బంధించి ఊర్ధ్వదిక్కు (పైన) నమస్కారము చూపించి తలపై గుండ్రంగా ప్రదక్షిణపూర్వకంగా — **"ఓం నమశ్చక్రాయ స్వాహా ఊర్ధ్వదిగ్భంధస్వాహా"** అని 'క్రమదీపికా' మంత్రశాస్త్రములో చెప్పిన విధానంతో చేయాలి.

ఆ తరువాత తీర్థంతో చేతులు స్పృశించి కళ్ళు, మూతి, చేతులు, పాదములు, హృదయము తడిచేసుకుని శుచియై పద్మాసనమును బంధించి ముందు గురుధ్యానంచేసి ఆపైన గణాధిపతిని నమస్కరించాలి. ఆ తరువాత మూడుసార్లు అరచేతిలో శబ్దమయ్యేలా చప్పట్లు

చరచి దిగ్బంధముద్రను (చూపుడువ్రేలు, మధ్యవ్రేలు, ఉంగరంవేలు కలిపి బొటనవ్రేలితో సంపుటిచేసి అరచేతిలో చిటుకవలె చప్పుడు చేయాలి. భూతశుద్ధిని పఠించాలి.

## ప్రాణాయామ విధానము :

పైన చెప్పిన పద్ధతిలో భూతశుద్ధిచేసాక జపప్రాణాయామం ఈవిధంగా చేయాలి — కుడిముక్కుతో 'అం' బీజాక్షరంతో శ్వాసను నిండుగా పీల్చి 'ఉం' అను బీజాక్షరంతో 16 సార్లు లెఖ్ఖపెట్టాలి. ఆపైన ఎడమముక్కునుండి గాలిని పూరించి 'ంమ్' అనుశబ్దంతో 12 మార్లు జపించి ఖాళీగా శ్వాసలేకుండా నిలపాలి ప్రాణాని! ఈవిధంగా 3 ప్రాణాయామాలుచేసి ఆపైన 'అం' అను బీజాక్షరంతో కుడిముక్కు లోనుండి ప్రాణమును విడిచి 12 లెఖ్ఖించేదాకా శ్వాసవిడిచి — 'హుం' బీజాక్షరంతో ఎడమముక్కుతో శ్వాసను పీల్చాలి 16 బీజాక్షరముల లెఖ్ఖ వరకు! ఆతరువాత 'ంమ్' శబ్దంతో 12 సార్లు ఆవర్తములుచేస్తూ కుంభకం (గాలి పీల్చకుండా నిలపడం) చేయాలి.

ఆపైన తాను జపంచేసే మూలమంత్రమును బీజాక్షర సహితంగా — ముందుగా ఎడమముక్కుతో ఆ తరువాత కుడిముక్కుతో పూరకం, కుంభకం, రేచకం ప్రాణాయామములు చేయాలి. 8, 16, 32 సంఖ్యలు పీల్చడం, విడవటం, నిలువడం శ్వాస విడచడం చేయాలి.

విష్ణుమంత్ర జపవిధానం అయితే 16, 30, 64 సంఖ్యలు లెఖ్ఖించే వరకూ పూరకం, కుంభకం, రేచకంచేసి ప్రాణాయామం చేయాలి.

ఈ విధానంలో ప్రాణాయామం రోజూ మూడు సంధ్యలయందూ — అనగా ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రమూ వేళతప్పకుండా 16 సార్లు ప్రాణాయామంచేస్తే సమస్త పాపములు భస్మం చేయబడి శరీరం మంత్రానికి సిద్ధి అవుతుంది.

ఇలాగ మంత్రసిద్ధితో శరీరాన్ని పవిత్రంచేసి క్లీం అన్న బీజాక్షరంతో కలిపిన గోపాలదశాక్షరీ మంత్రంగానీ — లేదా గోపాలక అష్టాదశాక్షరీ మంత్రంతోగానీ జపించాలనీ 'క్రమదీపిక'లో చెప్పబడింది.

**కరన్యాసము :**

ఆపైన కరన్యాసము చేసే విధానం ఇలాచేయాలి.

పద్మాసనంలో కూర్చుని రెండు హస్తములు మోకాళ్ళపై ఆన్చి అరచేతిని పైకిత్రిప్పి బొటనవ్రేలు మొదటి కణుపుతో ప్రారంభించి — **"అంగుష్టాభ్యాంనమః"** అన్న న్యాసము మంత్రవిధానంతో చెప్పిన బీజాక్ష రాలతో చేయాలి. ఆ తరువాత తర్జనీ (చూపుడువ్రేలును బొటన వ్రేలుతో చూపిస్తూ క్రమంగా మధ్యవ్రేలు, ఉంగరంవ్రేలు, చిటికెనవ్రేలు అట్టడుగున కణుపుతో అంగన్యాస బీజాక్షరం చేయాలి.

ముందు కుడిచేతి అరచేయిని — ఆతరువాత ఎడమచేయి అరచేతిని తాకిస్తూ ఆతరువాత కుడిచేతివెనుక (కరపృష్టం) ఆతరువాత ఎడమచేతి కరపృష్టం ముట్టుకుంటూ కరతలకర పృష్టాభ్యాంనమః అని మూలమంత్రంలోని 6 మంత్రాంగములతో కరన్యాసము చేయాలి. ఆపైన ఋషిఛంధస్సును ఈక్రిందివిధంగా చేయాలి.

ఋషి :

ప్రతిమంత్రమునకూ మొదట్లో ఋషిపేరుచెప్పి 'శిరసేస్వాహా' అని — అని ఆ ఋషియందు పరమ గౌరవంతో వారి పాదములయందు మన శిరస్సును తాకించినట్లు శిరమువంచి శిరోన్యాసము చేయాలి! ఋషివర్యుల గురుత్వముచేత శిరసా ధరించాలి అని శాస్త్రము. ఛందస్సు అక్షరత్వంచేత నాలికయందు ధరించాలి. మంత్రదేవతను హృదయము నందు న్యాసంచేయాలి. 'మంత్రసార సముచ్ఛయము'లో చెప్పబడిన ప్రమాణం ప్రకారం —

"ఋషి అన్న అక్షరమునకు అర్థం 'గతి' (కదలిక) మరియు ప్రాప్తి (చేరుకోవలసిన గతి) అన్న రెండు అర్థములవల్ల ఋషి గురు వాచకుడు

**ఋషిర్గురుత్వాత్ శిరసైవ ధార్యః ఛందోఽక్షరత్వాత్ రసనాగతం స్యాత్**

**ధియాఽవగంత వ్యతయా సదైవ హృదిపతిష్టా మనుదేవతాచ ఇతి॥**

**పునరేషామర్థశ్చ తత్రైవోక్తః**

**ఋషివర్ణాదికౌ ధాతు స్థోగత్యాం ప్రాపఽణేపిచ ।**

**తాభ్యాం యద్యత్స్వరూపం స ఋషిఃస్యాద్ గురువాచకః ॥**

**ఇచ్ఛాదానార్థకౌ ధాతు స్తశ్చదాద్యాశ్చ దాదికః ।**

**తయోరిచ్ఛం దదాతీతి ఛందో మంత్రార్థవాచకః ॥**

**ఆత్మనోదేవతాభావ ప్రదానద్దేవతేతిచ ।**

**పదం సమస్త మంత్రేషు విద్వద్భిస్సముదీరితం ॥**

**ఛంధస్సు :**

ఛంధస్సు అన్నమాటకు — ఇచ్ఛ లేక కోరికలను దానార్ధకము ఇచ్చుట అనగా కోరికలను అనుగ్రహించుట అన్న ధాతువువల్ల — 'ఛం' — దధాతి = ఛంధః అనగా కోరికలను అనుగ్రహించేది — అక్షర స్వరూపియగు మంత్రార్ణవాచకము అంటే దేవతలయొక్క మంత్రా క్షర స్వరూపమైన ఆకారమే ఛందస్సు అని మంత్రశాస్త్ర ప్రమాణము. ఆ తరువాత మాతృక మంత్రముతో షడంగరన్యాసము ఈక్రింద చెప్పిన విధంగా చేయాలి — ప్రతీ ఆద్యంతములో చిటికెలశబ్దం అక్షరన్యాసం చేయాలి. ఈక్రింది క్రమములో

**అం కఖగఘఙ ఆం హృదయాయ నమః**

**ఇం చఛజఝఞ ఈం శిరసేస్వాహా**

**ఉం టఠడఢణ ఊం శిఖాయైవషట్**

**ఎం తథదధన ఏం కవచం**

**ఓం పఫబభమ ఔం నేత్రాయఫట్**

**అం యరలవష సహళక్ష అః అస్త్రాయఫట్**

**ముద్రలు :**

ముద్రలు అనగా — అంగన్యాసముచేసే సమయంలో కవచము, అస్త్రము చెప్పేటపుడు చేసే న్యాస సమయంలో చేతితో పట్టే ముద్ర! మంత్రశాస్త్రగ్రంధము క్రమదీపికలో' చెప్పిన ప్రకారము — చేతిని చాపి వ్రేళ్ళు ఋజువుగా హృదయాన్ని తాకించితే హృదయన్యాసముద్ర అదే శిరస్సున — శీర్షన్యాసము.

గుప్పెడుపట్టి బొటనవ్రేలుపైకి శిఖరంలా పొడుచుకుని వచ్చేట్టు తలపై శిఖవద్ద శిఖాన్యాసము అలాగే చేతి రెండువేళ్ళనూ నిటారుగా చేసి మిగతావేళ్ళను ముడిచి కుడిభుజం ఎడమభుజంపై కవచముద్ర. చేతివేళ్ళను కోసుగా బాణంయొక్క వాడి ములకువలే పట్టి బొటనవేలు, చూపుడువేలుతో చిటికెనవేలుతో కలిపి — అస్త్రముద్ర చిటికెవేసిన శబ్దంతో చేయాలి. విషశత్రువినాశకరము ఈ అస్త్రముద్ర అని చెప్ప బడినది.



6

# మంత్ర న్యాసము

ఏ మంత్రానికైనా ఉపాసన చేయాలి అంటే ఆ మంత్రమునకు 'న్యాసము' 'ఋషి' 'ఛందస్సు' వుండాలి. విష్ణుసహస్రనామం ఒక మంత్రం క్రింద ఉపాసన చేసినపుడే దానికి అంగన్యాస కరన్యాసములు చేయాలి.

ఊరికనే భగవంతుని స్మరించుకుని రామనామం చేసినట్లు చేయాలంటె దానికి ఏమీలేదు. రామనామం తారకనామం. దానికికూడా కొంత సమయం పెట్టుకుని రామనామం సిద్ధించాలంటే రామనామానికి కూడా అంగన్యాసం కరన్యాసం కావాలి. ఈ అంగన్యాస కరన్యాసముల ఉపయోగం ఏమిటంటే మన శరీరంలో **72 లక్షల నాడులున్నాయి**, అందులో **72,000 నాడులు** ప్రధానమైన నాడులు. ఈ నాడులు, నరాల్లాగా శరీరంలో అన్నిచోట్ల ప్రయాణం చేస్తుంటాయి. మన రైల్వే లైనులు రెండు మూడు

ఒకచోట ఎలాఅయితే Cross అవుతాయో అలా ఈ నాడులు సెంటర్ల లాగా ఏర్పడతాయి. అలా నాడులు కూడలిఅయ్యే ప్రదేశాన్ని ప్రాణానికి "ఆయువుపట్టు" అంటారు. మన శరీరంలో ఆయువుపట్లదగ్గర దెబ్బ తగిలితే వెంటనే ప్రాణం పోతుంది. మిగతాచోట్ల దెబ్బతగిలితే బ్రతుకు తాడు. ప్రాణస్థానం ఈ కూడలి. ఆయుర్వేదంలో కూడా కొన్ని కొన్ని చోట్ల ప్రాణాస్థానాలుంటాయని చెప్పారు. అంటే మర్మస్థానాలు అని అర్థం. పాదాలు మర్మస్థానం - అంటే ఆయువుపట్టు. అట్లాగే ముఖం. అంటే నాడులు అక్కడ ప్రాణశరీరాన్ని అంటిపెట్టుకుని ఉండేటువంటి మూల స్థానం. ఈ జీవున్ని శరీరంలో పెట్టేప్పుడు భగవంతుడు ఈ జీవున్నీ, శరీరాన్ని కలిపి పరుపు కుట్టినప్పుడు అక్కడక్కడ ఎలాగైతే కుట్లువేస్తామో అలా కుట్లువేసి వుంచాడు. శరీరంలోనుంచి జీవుడు ఉద్వాసన కావాలంటే ఆ కుట్లు తీసేస్తేకాని బయటికిపోడు. అందుకని మోక్షానికి కూడా ఆ Point ముఖ్యం. శరీరంలో మనం అంత్యసమయంలో చేసిన ధ్యానమే ముఖ్యం. మోక్షానికి కూడా అదే ముఖ్యం. అందువల్ల ఆ ప్రాణస్థానంనుంచి న్యాసం అనేటటువంటిది ముఖ్యం. ఎక్కడయితే శరీరంలో ప్రాణాస్థానాలు న్నాయో అక్కడే "బీజాక్షరములు" 'ఋషి' 'ఛందస్సు' అక్కడే ధ్యానం అన్నికూడా చేయాలి. అందువల్ల న్యాసం చేసి మనమేమంత్రం చేస్తామో అది నాడులలో Print అవుతుంది. అది మనం నిద్రపోతూవున్నా, అనారోగ్యంగావున్నా, Sub cousious లో వున్నా ఈ ప్రాణస్థానంలో record అయింది ఏదయితే వుందో Tape లో record అయింది బయటికి పోనట్టుగా స్థిరంగా మంత్రం లోపలి జీవుడిలో

అంతర్గతమైవుండి పోతుంది. అది అంతిమ సమయంలో మోక్షానికికాని, ఈలోపల మంత్రసిద్ధికి కాని ఉపయోగపడుతుంది.

దీనిలో ఇంకొక ముఖ్య ఉపయోగంవుంది. వైష్ణవసిద్ధాంతంలో భగవంతుడిని శరణమూర్తిగా సేవించుకుంటాం. నిర్మల మూర్తిగనే భగవంతుడు వున్నాడుకానీ సేవించుకునే శక్తి మనకులేదు. అందువల్ల అంగాంగభావం, అంటే భగవంతుడిలో పాదదర్శనం, నేత్రదర్శనం ఇలాగ సంపూర్ణంగా దర్శనం చేసుకున్నప్పుడు మనకు ఎట్లా అయితే అవయవా లున్నాయో భగవంతుణ్ణికూడా అదేమాదిరి భావనచేస్తాం. ఈ భావన చేసినప్పుడు అవయవానికి, అవయవానికి ఆవిర్భావం చేసినట్లు ఈ అంగన్యాసమువల్ల స్పర్శ కలుగుతుంది. ఆవిధంగా శరీరంలో భగ వంతునియొక్క న్యాసం జరుగుతుంది. అంటే శిరస్సునందు వారి శిరస్సు, మన హృదయంనందు వారి హృదయం అలా అంగాంగము Print చేసినప్పుడు ఎలా ఏర్పడుతుందో అలా అవుతుంది. న్యాసం అంటే ఒకదానిపై ఒకటి వేయటం. దానివల్ల ఈ లోపలవున్న జీవుడు భగ వద్భావాన్ని పొందుతాడు. సారూప్యం పొందడం అంటే ఏమీ ఆకారము లేని మట్టిపై వినాయకుని అచ్చువేస్తే ఆ మట్టిమీద కూడా వినాయకుడు ఎలా ఆకారం పొందుతాడో అలా ఈ ఆకారంలేని జీవుడుకూడా ఈ న్యాసంవల్ల భగవంతుని ఆకారం పొందుతాడు. భగవంతుని సంబంధ మైన రూపం పొందడానికి ఈ అంగన్యాసం ఉపయోగపడుతుంది. ప్రాణం అనేది గీతలాగ వుంటుంది. కానీ న్యాసం చేసినప్పుడు నీళ్ళు Freeze చేసినప్పుడు ఆ నీళ్ళను ఏ ఆకారంలోపోస్తే ఆ ఆకారం

వచ్చునట్లు ఈ మంత్రబద్ధం చేసినటువంటి ప్రాణం ఒక ఘనీభవించిన భగ వంతుని రూపం పొందుతుంది. లోపల అంతరాత్మకు ఈ న్యాసం ఉపయోగపడుతుంది. (సులభంగా అర్థ మవటంకోసం ఇన్ని ఉదాహరణ లిచ్చాను.)

మంత్రమునకు అంగన్యాస, కరన్యాసములు రెండూ చేస్తాం. మన సాముద్రికం ఏమిచెబుతుందంటే ఈ శరీరంలో ఎన్ని భాగాలున్నాయో అన్ని భాగాలు ఈ చేతిలోవున్నాయి. తరువాత మన జాతకంలో ఎన్ని భాగాలున్నాయో అన్నిభాగాలు చేతిలో వున్నాయి. జీవితమంతా పన్నెండు (12) గళ్ళలోనేకదా జాతకమంతా ఇమిడ్చిపెట్టింది. ఇక్కడ కూడా ఈ 10 వేళ్ళు, కరతల, కరపృష్ఠములు పన్నెండు (12). సాముద్రికంచూస్తే మనకు జీవితమంతా తెలియడానికి కారణం ఏమంటే మొత్తం కాలపురుషుని యొక్క జాతకం కూడా దీనిలోనేవుంది. అందువల్ల ఎక్కడెక్కడయితే అంటే చేతిలో మంత్రాలు న్యాసం చేస్తామో మన జాతకంలో అన్ని భాగాల్లో ఆ భగవంతుని భావం పనిచేస్తుంది. శరీరంలో ఎన్ని అవయవా లున్నాయో పాదముల దగ్గరనుండి అన్ని ఎనిమిది అవయవాలు. ఇవి ఎనిమిదికాక మనసు, బుద్ధి, ఆత్మ, పరమాత్మ, మొత్తం పన్నెండు (12). ద్వాదశం సజీవుడికి అని ద్వాదశాక్షరి ఉపదేశం అప్పుడు రహస్యంగా చెబుతారు. ఇంతకన్న ఎక్కువ వివరములు ఎందుకు చెప్పలేదంటే అది పదిమందికి చెప్పేదికాదు. ద్వాదశాక్షరం దీనిలో క్షరం అంటే నాశనం అని అర్థం. అక్షరం అంటే నాశనము కానటువంటివి అని అర్థం. అలా నాశనముకాని పదార్థములు పన్నెండువున్నాయి సృష్టిలో ఆ

పన్నెండూ (12) చేతిలోనూ వున్నాయి. అవయవాల్లోనూ వున్నాయి. సర్వాంగములు న్యాసం చేసేదాన్ని అంగన్యాసం అన్నాం. ఈ కరములతో న్యాసం చేసేదాన్ని కరన్యాసం అన్నాం. ఈ ద్వాదశాక్షరం. అక్షరం అంటే మనం ఉచ్ఛరించే మంత్రాక్షరం. అని ఒక అర్థంవుంది. నాశనము లేనటువంటి ప్రకృతిలో వుండే పన్నెండు (12) శాశ్వతతత్త్వాలు ద్వాదశ తత్త్వాలకు, వీటిలో అంటే శరీరంలో అవయవాలకు సంబంధం ఇస్తుంది ఈ న్యాసం. అందువల్ల దీని వివరాలన్నీ భాగవతంలో నారాయణ కవచంలో ఇచ్చారు. నారాయణ కవచంలో కరన్యాసం ద్వాదశాక్షర విద్యలో చేయమన్నారు. అంగన్యాసం అష్టాక్షరివిద్యలో చేయమన్నారు. ఎనిమిది (8) అంగములు **"ఓం నమో నారాయణాయ"** కు ఎనిమిది (8) అక్షరములు. ద్వాదశాక్షరి **"ఓం నమో భాగవతే వాసుదేవాయ"** కు కరములు ఆరు (6). న్యాసములు ఆరు (6). హృదయ న్యాసములు ఆరు (6) భగవంతునికి ఈ ఆరు **"ఓం విష్ణవేనమః"** భగవంతుని ఈ మూడురూపా లకు మూడు రహస్యార్థములున్నాయి. అవి చాలా మోక్షవిద్యలోకి వెళ్ళాల్సి వుంటుంది.

మోక్షం అంటే ఎలా పొందుతాడు జీవుడు. దానికి పద్ధతి ఎవరికీ తెలియదు. ఊరికే మోక్షం, వేదాంత విషయం కథక్రింద చెప్పుకుంటారు. భాగవతంలో ఏమంటే భగవంతుని శ్రీమన్నారాయణుని ఉపాసించే టప్పుడు సూక్ష్మంగా మూడురకాలున్నాయి. 1. **వాసుదేవమూర్తి**, 2. **నారా యణమూర్తి**, 3. **విష్ణుమూర్తి**. అంటే ఈ యావత్ సృష్టిలోనూ చరాచర జీవరాసులెన్నున్నాయో స్థావరజంగములు వాటియందు అంతర్యామితుడై

భగవంతుడున్నాడు. ప్రపంచమంతటాకూడా వ్యాపించిన విరాట్ స్వరూపుడు వాసుదేవమూర్తి. "ఓం నమో భగవతే వాసుదేవాయ" అని ఉపాసించేటటువంటి భగవన్మూర్తి విష్ణుమూర్తియొక్క సర్వవ్యాపకత్వాన్ని సూచించేది. "విశ్వం విష్ణుర్వషట్కారో" ఆవిశ్వం అనేటటువంటి మొదటి నామాక్షరం ఈ వాసుదేవమూర్తియొక్క ఉపాసన. ఈ చరాచర ప్రకృతి కంతా అతీతుడై వున్నాడు ఆ పరమాత్ముడు. అందువల్ల ప్రకృతిలోవున్న పంచభూతములు, దీనిపైవుండే "మనోబుద్ధి అహంకారములు" ఈ ఎనిమిది అష్టవిధ ప్రకృతులు. అవి నారాయణమూర్తియొక్క ఉపాసన. అలాగే ఐదు ఇంద్రియములు, ఆరవది మనస్సు "ఓం విష్ణవే నమః". ఈ మూడింటిలోనూ మోక్షంలో తేడావుంది. **వాసుదేవమూర్తిని ఉపాసించే వాళ్ళు** సర్వభూతాల్లోనూ, చరాచర జీవాలలోనూ తాము సారూప్యాన్ని పొందగలుగుతారు. **తామే విరాట్‌స్వరూపాన్ని** పొందగలుగుతారు. అంటే సృష్టిలో శాశ్వతత్వాన్ని పొందగలుగుతారు. ఎంత కాలమయితే నక్షత్రములు, సృష్టి స్థిరంగా వుంటుందో అంతకాలం వాళ్ళందరు కూడా చిరంజీవులై అంతర్భూతులై మిగులుతారు. అయితే అందులో వుండకుండా ఈ సృష్టితో మనకేంపని? ఎంతకాలం నడుస్తుందో అంతకాలం నడుస్తుంది. మనం దీనిలోనుంచి తప్పుకోవాలనుకునేవాళ్ళు ఈ అష్టాక్షర మంత్రం (ఓం నమో నారాయణాయ) తీసుకుని ఈ అష్టవిధ ప్రకృతికి అతీతులై వెళ్ళిపోతారు. ఆవిధమైన ముక్తి కావాలనుకుంటే ఈ ప్రకృతి నుంచి విమోచనం పొందాలంటేమాత్రం అష్టాక్షరి చెయ్యాలి. యోగాభ్యాసం ప్రకారం భగవంతుని సాధించాలంటే **'ఓం విష్ణవేనమః'**

అనే మంత్రం చెయ్యాలి. ఈమాదిరిగా వుంది. ఈ మూడు చేసినట్లయితే మూడూ (3) సిద్ధిస్తాయి. అంటే వాడు సాక్షాత్తూ భగవంతుడైపోతాడు.

ఇక న్యాసంలో ప్రాముఖ్యం ఏమంటే ఈ లోపలి శరీరంలో జీవభూతుడైనటువంటి పరమాత్మకునూ, అసలు స్వయంవ్యక్తుడై సహజ స్థితిలోవున్న పరమాత్మకునూ సంబంధం కలిగిస్తుంది. మనకు శారీరకంగా ఈ ప్రపంచంలో ఒక్కతాడు మూలాన ఈ భార్యకు, భర్తకు ఏవిధమైన బంధం కల్గిస్తుందో అలా లోపల వుండేటటువంటి ఈ భార్య అనబడే జీవునికి, పరమాత్మ అనే భగవంతునకు బంధం కల్గించేది ఈ న్యాసం. ఉన్నది ఒక్కడే పరమాత్మ అని చెప్పేది విష్ణుసహస్రనామం. అది మొట్ట మొదట వచ్చిన మంత్రం. ఎంతమంది దేవతలున్నారో అన్ని సహస్ర నామాలున్నాయి. కానీ అన్నిటికంటే అధికమైనటువంటిది విష్ణు సహస్ర నామం. ఈ న్యాసం విష్ణుసహస్రనామావళికి పనికివస్తుంది. ఎందుకంటే ఋషిప్రోక్తమైనటువంటిది. వ్యాసభగవానుడు సృష్టించినటువంటిది. "కిమేకం దైవతం లోకం" ప్రపంచంలో అన్ని దేవతలకంటే సర్వోత్తముడైన భగవంతుడు అని చెప్పకోదగినవాడు ఎవరు అని ధర్మరాజు, భీష్మల వారిని అడిగేరంట. అప్పుడు భీష్మలవారు అందరి దేవతలకు సహస్ర నామాలున్నాయని తెలిసి విష్ణుసహస్రనామమే ఎందుకు చెప్పాల్సి వచ్చిం దంటే అన్ని దేవతలలోనూ సర్వశ్రేష్ఠుడైనవాడు అందరు దేవతలు ఎవరి శరీరంలో, విరాట్‌స్వరూపుడై అంగభూతాలతో విశ్వరూపుడై కనపడ్డాడో ఆస్వరూపాన్ని గురించి అడగడంచేత విష్ణుసహస్రనామం చెప్పేడు. విష్ణు సహస్రనామంలో అందరు దేవతలు అంగభూతులైవున్నారు. కానీ ఇతర

దేవతలలో విశ్వమూర్తి అంగభూతుడై వుండడు. అందుచేత విష్ణు సహస్ర నామానికి ఈ ప్రాముఖ్యత వుంది. ఏఏ పూజకు ఆ అంగన్యాసం వుంటుంది.

## అంగన్యాసమునకు అర్థము :

పైన చెప్పినవిధంగా మంత్రజపానికి ముందు 'అంగన్యాసము ఎందుకు చేయాలి?' అన్న ప్రశ్నకు 'క్రమదీపిక' చెప్పిన ప్రకారంగా — ఈవిధముగా చెప్పబడింది.

'హృదయన్యాసము' చేయడంవల్ల మంత్రము బుద్ధిలో ప్రవేశించ వలెనని (మనస్సునుదాటి బుద్ధిలో ప్రవేశించుట) సూచితము. హృద యము ఈశ్వరస్థానము గనుక హృదయకేంద్రంలో మంత్రదేవత ప్రవే శించడానికి ఇది సూచన అని నమః = నేనుకాదు మంత్రదేవతయే — అన్న నమస్కారశబ్దము అర్థము. శిరోన్యాసములో శిరస్సునందు న్యాసము చేయుటలో ఈ మంత్రము శిరస్సువలే సర్వశ్రేష్ఠమైనదీ, పరమోన్నతమైనదీ — కోరికలను మనస్సులోని ఆలోచనలను నిర్మూ లించి మనస్సును ఉన్నతమైన సమాధిలోనికి తీసుకొనివెళ్ళుట' అన్న అర్థము సూచితము.

శిఖాన్యాసముచేత — 'శిఖ' అన్నమాటకు అగ్నిశిఖ అన్న అర్థము తేజస్సు సూచితము. పంచభూతములచేత నిర్మితమైన శరీరము మనస్సు చేత నడిపించబడుతున్నది గనుక అరవదైన సూచించేది మనస్సు, శిఖాయై నమః అన్నది న్యాసము.

ఇక కవచమంత్రముతో కవచన్యాసము ఎందుకు చేయాలి? అంటే సంస్కృతంలో — 'కవ' = పట్టుకొనుట లేక ధరించుట అన్న ధాతువు వల్ల కవచం అన్న శబ్దం పుట్టింది. 'హుం' అన్న బీజాక్షరంతో ఉద్భ వించే తేజస్సువల్ల శరీరం ఆ మంత్రమును పట్టివుంచుతుంది — 'గ్రహణ' స్వరూపమైన కవచం ధాతువువల్ల

'త్రినేత్రన్యాసము' నేత్రత్రయోయోషట్ — అన్నమాటకు అర్ధము మూడు ప్రాణశ్వాసనాడులైన ఇడాపింగళ సుషుమ్నా నాడులతో పనిచేసే సూర్యనేత్రము (కుడికన్ను) చంద్రనేత్రము (ఎడమకన్ను), అగ్నినేత్రము భ్రూమధ్య త్రినేత్రము. మూడు ప్రాణములు మేల్కొల్పబడతాయి. కరెంటువంటి శక్తిచేత.

'అస్త్రాయఫట్' — అన్న మంత్రమునకు అర్ధము 'అస్త్ర' = అసు + త్ర అన్న శబ్దములుచే కలిగినది. అసు = అంటే ప్రాణము త్ర = రక్షించుట — ప్రాణములను రక్షించేది అసు + త్ర = అస్త్ర. 'ఫట్' అన్న మంత్రము అగ్నిని సూచించును.

కాబట్టి ఈ అస్త్రమంత్రముతో శరీరములోని ప్రాణశక్తి ప్రజ్వరిల్లి 'ప్రాణాగ్నిహోత్రము' అనే అగ్నిజ్వాల శరీరంలో ప్రాణశక్తితో జ్వలిస్తున్నది! ఈ లోపల వెలిగే జ్వాలతో చేసే జపమే యోగిలో జరిగే అంతర్యాగము (అంతర్ముఖంగా ఆత్మలో జరిగే అగ్నిహోత్రయజ్ఞం) అంతేగాక నేత్ర త్రయములచేత దర్శనం' అనగా దివ్యదృష్టి ప్రాపంచికదృష్టి అనే రెండు దర్శనములు — తేజోరూపమైనవి శరీరంలో మేల్కొనాలి అని సంక ల్పించి చెప్పేవి 'నేత్రత్రయాయవౌషట్' అనే న్యాసంయొక్క ఉపయోగం.

దీనివలన శరీరంలోని షడంగములు (అంగన్యాసము) మంత్రబీజాక్షరములతో మేల్కొని శక్తిని పుట్టించి — చేతిలోని షడంగముల న్యాసంతో కరన్యాసము ఆ శక్తిని స్పర్శద్వారా తాకించి ఆశీస్సుద్వారా ఇతరులకు ప్రసరింపచేసే మంత్రశక్తికి సూచనయే ఈ న్యాసవిధి అని తెలియాలి. దీని అర్థాన్ని పూర్తిగా భావనచేసి — మనస్సునుపెట్టి అర్ధమును భావిస్తూ అంగన్యాసము, కరన్యాసము చేస్తే ఈ న్యాసవిధి పూర్తి ఫలితాలనిస్తుంది అని 'మంత్రసారసముచ్ఛయము' తెలుపుతోంది!



## 7

# పూజలో ముద్రల ఉపయోగం

మంత్రశాస్త్రంలో దేవతను ఆహ్వానించిన తరువాత దేవతయొక్క మంత్ర స్వరూపమైన బీజాక్షరాలను శరీరంలో 'న్యాసం' చేసుకొని సాధకుడు మంత్రమూర్తి అవుతాడు!

'మంత్రమూర్తి' అనగా మనలోని జీవాత్మ మన ధ్యానావాహనాదుల వలన పవిత్రీకరిణంపొంది — ఇష్టదేవతయొక్క బీజాక్షరములను మన శరీరంలో న్యాసం చేసినందువల్ల, మనం పూజించే దేవతాస్వరూపాన్ని పొందుతుంది — అంటే జీవుడే తనారాధించే దైవస్వరూపంగా తన ఆత్మపరిణామాన్ని పొందుతాడు. ఈ స్థితిలో చేసేది మంత్రశాస్త్రపూజ — దీనినే **'ఆరాధన'** అంటారు! అలానే ఆగమశాస్త్రం ప్రకారం చేసే పూజకు **'అర్చన'** అనిపేరు. — మహర్షి మరీచిప్రోక్తమైన విమానార్చనాకల్పం వంటి ఆగమశాస్త్ర గ్రంధాలలో అర్చనావిధానంలో — 'అర్చకాది మార్గము రహస్య పరిభాషలో వివరించాయి. అర్చకాది మార్గం అంటే ఏమిటో వ్యాసమహర్షి బ్రహ్మసూత్రాలలో — "ఆతివాహి

కాహ-తల్లింగాహ" అనగా జీవాత్మను బ్రహ్మలోకానికి కొనిపోయే — "అతివాహికములు" అనగా సూర్య కిరణముల వంటి తేజోకిరణములు విశ్వాత్మయొక్క ప్రసారముచేత జీవుడిని ఆ కిరణములద్వారా ఆకర్షించి బ్రహ్మపదానికి తీసుకొనిపోయేవి అతివాహకములు. — తత్ సంబంధ మైనది ఆగమోక్త అర్చన (అర్చిక్ = కిరణము అనగా భగవత్‌కిరణము).

ఇక్కడ సాధకుడు తాను ఉపదేశం పొందిన మంత్రంద్వారా ఇష్ట దేవతతో ఐక్యం పొందడానికి 'అంగన్యాస కరన్యాసములు' చేసినట్లే — ఆరాధనలో తానుచేసే పంచోపచార పూజకు తన ఆత్మలోనే ఆవ హించివున్న ఉపాస్యదేవతను (ఉపాసించబడే దేవత) చేరుకోడానికి తాను చేసే ప్రతీపనీ అనగా పూజలో చేసేపని ముద్రలుపట్టి సమర్పిస్తాడు.

ఇలాంటి ముద్రలు 'సురభి' 'గరుడ' 'చక్ర' 'దాక్ష్య' 'యోని' 'శంఖ' 'ధ్వజా'ది ముద్రలూ — అలానే ఆరాధనలోని పంచోపచారము లకూ సంబంధించిన పుష్పోపచారముద్ర, నైవేద్యముద్రకూ, చందనోపచార ముద్రపట్టి పంచోపచారములు సమర్పించాలి. ఇది ప్రపంచ సార సంగ్రహము, మంత్రమహోదధివంటి గ్రంధములలో వివరించబడ్డది. గాయత్రీమంత్రమునకు కూడా సంధ్యావందన కాలంలో పూర్వం బ్రహ్మ చారులు ఇలాగ సురభి, గరుడ, తారక్ష్యముద్రలు పట్టేవారు! అంతేకాదు ఈ **'ముద్రలు లేకపోతే గాయత్రీ నిష్ఫలమవుతుంది'** అని ఒక ప్రమాణ వాక్యంకూడా వున్నది.

**ఆరాధనలో ముద్రలు :**

**1. చందనోపచారముద్ర :**

ఇది రెండు చేతులా బొటనవ్రేలు కొనలను రెండు చేతుల యొక్క చిటికెనవ్రేలు మధ్యకణుపు స్పర్శించేలాగ ఈ ముద్రను పట్టి

— ఓం గంధం కల్పయామి — ఇతిశ్రీచందనం సమర్పయామి అని చందనోపచారముద్ర చెప్పబడింది.

2. అలానే చూపుడువ్రేళ్ళు రెండింటి చివరి కణుపులు బొటన వ్రేలిమధ్య కణుపును స్పర్శించేలాగ రెండు చేతులూ కలిపిన పై ముద్రతో చందనం సమర్పించాలి.

**3. పుష్పోపచారముద్ర :**

చూపుడువ్రేలు మొదటి కణుపు బొటనవ్రేలు మధ్యకణుపుతో కలిపి మిగతా వ్రేళ్ళను పుష్పమువలె చాపి రెండు చేతులతో కలిపి పట్టేది పుష్పోపచారముద్ర.

ఇదే ముద్రతో నైవేద్యముద్ర దీపసమర్పణ ముద్రపట్టి మాన సోపచార పూజలో — అయా వస్తువులను మనసా సంకల్పించి సమ ర్పించవలెను. బహిఃపూజచేసే సమయంలో ఈ ముద్రతోపాటు ఆయా వస్తువులను చందనం, ధూపం, దీపం, నైవేద్యం, కర్పూరహారతి, పుష్పాంజలినిచ్చి ఆరాధన సమర్పించాలి. ఈ ముద్రలు అతి ప్రాచీన మైన సాంప్రదాయం.

ముద్రలు పట్టడం — 1. యోగశాస్త్రంలోనూ — ఉపదేశముద్ర, అనుగ్రహముద్ర, అభయముద్ర, వరదముద్ర వంటివి వున్నట్టే — నాట్య శాస్త్రంలోకూడా నృత్యాన్ని ఆరాధనగా చేసేవారు భగవంతుని ఐక్యత పొందిన తన్మయత్వంతో చేతులతో పట్టే పతాకముద్ర, కూర్మముద్ర, గరుడముద్ర, వరాహముద్ర, శంఖ, చక్ర, గదాముద్రలు నృత్యవిధానంలో కూడా ఆరాధన అన్న పద్ధతిలో చేసే రోజులలో అభినయించేవారు.

ఈ ముద్రలయొక్క ప్రభావంవల్ల ఆకాశంలో అదృశ్యరూపంలో వున్న దేవతలను మన శరీరము లోనికి ఆహ్వానించవచ్చు.

దీనిశక్తి యోగులవద్ద మంత్రశాస్త్రం ప్రకారం నేర్చుకోవాలి. పూర్వం అస్త్రాలను యుద్ధంలో క్షణకాలంలో ఉజ్వలంగా ప్రజ్వలించేలాగా అగ్ని, ఇంద్ర, వరుణాది దేవతలను ఆకర్షించేది ఈ ముద్రలను పట్టే, వేసే వారు — ఇది అస్త్రవిద్యలోని ధనుర్వేదంలోనిది! ఇప్పటికింత చాలు!

**పంచోపచార పూజలు :**

**తంత్రసారసముచ్ఛయం** ప్రకారం — పంచోపచారములు ఈ మంత్రాలతో సమర్పించాలి.

1. 'లం' — పృద్వీయాత్మనే — నారాయణాయ సత్యుం ఇతి గంధకల్పయామి.
2. 'హం' — ఆకాశాత్మనే — వాసుదేవాయ 'బ్రహ్మ' పుష్పం కల్పయామి.
3. 'యం' — వాయ్వాత్మనే సంకర్షణాయ ధూపం కల్ప యామి.
4. 'రం' — అగ్న్యాత్మనే ప్రద్యుమ్నాయ దీపం కల్పయామి.
5. 'వం' — అబ్జాత్మనే అనిరుద్ధాయ అమృతాన్నం నైవేద్యం కల్ప యామి స్వాహా.

(ఇక్కడ మాతృకాన్యాసవిధి అందరికీ తెలిసినందున ప్రత్యేకించి వ్రాయడంలేదు).

దీనిలో సృష్టిన్యాసము, సంహారన్యాసము, విధిన్యాసము అని మూడు విధానాలున్నాయి.



8

# మంత్రోపదేశ విధానము

మంత్రోపదేశం గురించి అన్ని మంత్రశాస్త్ర గ్రంధాలు మహోన్నత మైన, శక్తివంతమైన యోగప్రక్రియగా దాన్ని వర్ణించారు!

ఈ మంత్రోపదేశంచేసిన ఫలితాన్నీయాలంటే — మంత్రసిద్ధిని పొందిన లేదా ఆత్మసాక్షాత్కారం పొందిన గురువుయొక్క అనుగ్రహంతో ఆ గురువువద్ద భగవంతునిపై నిర్మల ధృఢ భక్తివిశ్వాసములతో ఈ మంత్రోపదేశం నిజమైన సిద్ధినిస్తుంది.

శిష్యుడు సందేహపూర్వకంగా మంత్రమును ఉపదేశంగా పొందితే మంత్రదేవత అతడిని సందేహంగానే అనుగ్రహిస్తుంది.

గురువుఎడ అహంకారం లేక అనుమానం గర్వంతో అనుమాన భావన కలిగితే మంత్రసిద్ధి కలగదు. అందుకని గురువును సాక్షాత్ పరమాత్మ అన్న సద్భావనతో, పరిశుద్ధ భావనతో భగవద్గీతలో చెప్పిన ప్రకారం సర్వస్య శరణాగతిచేసి మంత్రదీక్ష తీసుకోవాలి.

(సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥)

అలాగే షిరిడీ సాయినాధుడు తన శిష్యుడికి ఆదేశించినట్టుగా –

**తద్విద్ధి ప్రణిపాతేన, పరిప్రశ్నేన సేవయా!**

**ఉపదేక్ష్యంతి తేజ్ఞానం జ్ఞానినస్తత్వ దర్శినః ॥**

అన్న గీతాచార్యుడైన శ్రీకృష్ణపరమాత్మ వ్యాఖ్యానాన్ని తనకి శిష్యుడైన నానాకు గర్వభంగపూర్వకంగా ఉపదేశించాడు.

"గురువునుంచే సకల మంత్రములు ఉపదేశంగా పొందాలి" – అన్నది మంత్రశాస్త్రవిధి. దీనికి తిరుగులేదు. ఎంతగొప్ప మంత్రమైనా విధివత్తుగా ఉపదేశం పొందనిపక్షంలో అది అక్షరముల కూడికయే. కాని **ఉపదేశము పొందిన మంత్రము — ఆ మంత్రదేవతయొక్క మంత్రమూర్తియే!** అనగా బీజాక్షరములతో ఏర్పడిన దేవతావిగ్రహము కరెంటువంటి శక్తిమూర్తి. ఇదే ఉపాసనలో భక్తునికి సిద్ధినిస్తుంది. ఉపదేశమునకు ముందు గురువు శిష్యుని బాగా శోధించి పరిక్షించి అహంకార క్రోధాది దోషాలు లేకుండావుంటేనే మంత్రోపదేశం చేయాలి. మంత్రోపదేశము పనిచేయడానికి ముఖ్యమైన షరతు — గురువే దైవమన్న ధృఢవిశ్వాసము! ఆ విషయంమీదే సందేహం కలవారికి మంత్రమూలేదు, మంత్రార్హతలేదు! కాబట్టి చిదంబరకల్పశాస్త్రంలో ఉపదేశించేముందు మానస నియమములు చెప్పబడ్డాయి. ఆ తరువాత మంత్రంయొక్క మిత్రత్వ శత్రుత్వాలు అరి — సిద్ధ సాధ్యవంటివి శోధించి అర్వణం ప్రకారం శిష్యునికి జన్మనక్షత్రం ప్రకారం అతని పేరులోని బీజాక్షరములు లేక ప్రాణాక్షరముల కలయికనుబట్టి అతనికి తగిన మంత్రాన్ని ఉపదేశించాలి.

అలా ఉపదేశించే ముహూర్తం కూడా శుభమైనదిగా మంచి కాలం లోనే ఉపదేశించాలి. అనగా శుభమైన మాసము, తిథి, నక్షత్రము ఇత్యాది శోధన జరగాలి. అదెలా నిర్ణయించాలో తరువాత అధ్యాయంలో తెలుసుకుందాం!

## గురూపదేశ విధానము :

మంత్రోపదేశం చేసే విధానం 'మంత్రమహార్ణవము', 'ప్రపంచ సారసారసంగ్రహము', 'శారదా తిలకతంత్రము' లలో చెప్పబడినది. అలానే 'బ్రహ్మాస్త్ర కల్పము' అన్న అముద్రిత తాళపత్రగ్రంధంలోకూడా దీక్షాప్రకారము గురువు ఉపదేశించే విధానం చెప్పబడివుంది.

ముందుగా శిష్యుడు గురువునకు సాష్టాంగనమస్కారము సర్వస్య శరణాగతిబుద్ధితో చేయాలి! "సాష్టాంగ" నమస్కారము అనగా — చేతులు, పాదములు, భుజములు, రొమ్ము, శిరస్సు, మనస్సు, వాక్కు, మోకాళ్ళు కలసి నేలకు గట్టిగా ఆనుకునేలాగ వినయపూర్వకంగా ప్రేమతో యిష్టంగా చేసే నమస్కారము, సాష్టాంగనమస్కారము.

## పంచాంగ నమస్కారము :

అలానే పంచాంగ నమస్కారము గురువునకు ఈవిధంగా చేయాలి. నుదురు, భుజములు, రొమ్ము, మోకాళ్ళు, పాదములు పూర్తిగా భూమికి తాకేలాగ నమస్కరించవలెను.

ఈవిధంగా గురువుకు నమస్కరించి దీక్షాప్రారంభంలో గురువునకు దక్షిణ సమర్పించాలి! ఇలా సమర్పించే దక్షిణలో విధిగా కొన్ని నాణెములు (Coins) బంగారమూ, వెండి, రాగితో చేసినవి వుండుట

ప్రశస్తము. చేతికి దీక్షాఉంగరము, నూతన వస్త్రములు (దీక్షావస్త్రములు) చందన తాంబూలాదులు, ఇంకనూ తనకిష్టమైన విలువైన కానుకలనూ సమర్పించవలెను. ఇలా సమర్పించేవారు మొత్తం మూలమంత్ర జప సంఖ్యలో సగంకాని, లేక నాల్గవవంతు సంఖ్యగాని సొమ్మును దక్షిణగా సమర్పించాలి. ధనంవుండి లోభించి దక్షిణ సమర్పించిన పక్షంలో మంత్ర లోపం, క్రియాలోపం, శ్రద్ధాలోపం మొదలుగాగల దశవిధ లోపాలవల్ల మంత్రసిద్ధి కలుగదు!

ఈ విధంగా గురుదక్షిణ సమర్పించి, కలశస్థాపనచేసి దీక్షాకలశాన్ని పంచపల్లవములతోనూ, గంగాది సర్వతీర్థాలతో, నవరత్నములు, సువ ర్ణము, మామిడి, నేరేడు బిల్వ, తులసి, ఉత్తరేణు, రావి పల్లవములు గల కుండకుపైన కొబ్బరిబొండమును పట్టువస్త్రముతో స్థాపించి గురు దక్షిణను సంకల్పపూర్వకంగా స్వస్తిపుణ్యాహవచనములతోసహా సమ ర్పించాలి.

**గురూపదేశవిధి ఇది :**

మంత్రాన్ని ముందుగా గురువు శోధించి, న్యాసమును, మంత్రము లోని షడంగాలూ విడివిడిగా ఏర్పాటుగావుంచి ఆతరువాత మంత్రాన్ని ముందు శిష్యుడికి ముందు న్యాసపూర్వకంగా, తరువాత దేవతాధ్యాన పూర్వకంగా ఆపైన మూలమంత్రసహితంగా శాస్త్రంలో చెప్పబడిన ప్రకారం ఉపదేశించాలి.

'రహస్యోపనిషత్' అన్న మంత్రశాస్త్ర గ్రంథంలో గురువు 'అంగ హీనము'లైన మంత్రములను అనగా అసంపూర్తిగావున్న న్యాసంతోగాని, లేదా ఋషి, ఛందస్సు, దేవత, కవచము, అస్త్రము, ధ్యానము వంటి

పూర్తి షడంగములులేని మంత్రాన్ని — ఎట్టి పరిస్థితులలోనూ శిష్యున కుపదేశించరాదు!

శంకరభాష్యంలోకూడా దేవతాది పర్వంలో

'ఎవరైతే మంత్రమునకు ఋషి, ఛందస్సు, దేవత, షడంగములు, తెలియకుండా ఉపదేశించడంకాని, తనకు **ఉపదేశం లేకుండా** దాన్ని జపపారాయణలోగాని **వినియోగించడం చేస్తాడో అట్టివాడు 'శిల'గా జన్మిస్తాడు** లేదా లెక్కలేనన్ని సంవత్సరాలు అంధకారకూపంలో పడి వుంటాడు. అందువలన మంత్రాన్ని సాంగోపాంగంగా సమగ్రంగా తెలిసి, మంత్రము మంత్రార్ధంతోసహా ఉపదేశ సమయంలో దానంచేయాలి!'

పైనచెప్పిన మంత్రశాస్త్ర గ్రంథంలోని **'ఆచారపటలం'**లో — మంత్రోపదేశంలో గురుశిష్యుల బాధ్యతలు (కర్తవ్యం) ఈవిధంగా చెప్ప బడినాయి.

నిర్మలమైన తెల్లని పట్టువస్త్రము ధరించి, రెండవసారి పునరాచ మనంచేసి గురువుకు సాష్టాంగ నమస్కారంచేసి పాదసన్నిధిలో కూర్చుని శిష్యుడు మంత్రోపదేశమును అర్థించాలి. ఉపదేశానంతరము గురువు శిష్యునికి ఆశీఃపూర్వకముగా ఫలమును, మంత్రాక్షతలను, దర్భతోచేసిన ఉంగరము, జపమాలను అనుగ్రహించి, 'జపించు!' — అని ఆజ్ఞా పించాలి! అప్పుడు జపించిన మంత్రము పూర్తిగా శిష్యునకు సిద్ధికలిగి సమస్త శుభఫలితాలను ఇస్తుంది! ఏ శిష్యునకైతే మంత్రమునందు గొప్ప భక్తి, శ్రద్ధకలిగి — మంత్రదేవతతో సమానమైన గౌరవము గురువు నందు కలిగి మూడింటియందు (1 గురువు 2 మంత్రము 3 మంత్ర దేవత) సమానమైన దృఢబుద్ధికలిగి జపించేవారు జీవించివున్నంతకాలమే

కాక, మరణానంతరంకూడా ఉత్తమలోకాలను పొంది తాము కోరిన సత్ఫలితాలను అనుభవిస్తారు ఈ జీవితంలోనే!

శిష్యుడు నిత్యం జపించేటప్పుడు కూడా గురువు, మంత్రము, మంత్రాలలోని దేవతలను వేరువేరని భావించకుండా ఏకభావంతో జపిస్తేనే మంత్రసిద్ధి కలుగుతుందని మంత్రశాస్త్ర గ్రంథమైన "మంత్ర దీపిక" అన్న గ్రంథంలోని "**ఉపదేశవిధి**" అనపటలంలో చెప్పబడివున్నది.

**విమలే పరిధాయ వాససీ పునరాచమ్య గురుం ప్రణమ్యచ ।**
**నికటే సముపాసతో వదేత్ అథ శిష్యస్య మనుం త్రిశో గురుః ॥**

**గురుణా సమనుగ్రహీతం మంత్రం సద్యో జపేత్ శతావృత్యా ।**
**గురుదేవతా మునానాం ఏక్యం సంభావయన్ ధియా శిష్యః ॥**

**మంత్రే మంత్ర గురావపి మంత్రీ మంత్రస్య దేవతాయాంచ ।**
**త్రిషు విహిత సతతభక్తిః ప్రేత్యేహ నిజేప్సితం ఫలంలభతే ॥**

త్రత్రగురుదేవతా మనూనామైక్యమాత్మనా ఏక్యం ధ్యాయన్ ఇత్యర్థః ॥

**శిష్యుని విధి :**

పైనచెప్పిన విధంగా గురువునకు దక్షిణపూర్వకంగా ఉపచారాదులు సమర్పించి జపము పూర్తిఅయిన తరువాతలేచి ధృఢభక్తితో మౌనంధరించి నియమమైన వాక్కుతో (అనవసరంగా మాట్లాడక) గురువుకు ముమ్మార్లు లేక ఐదుసార్లు ప్రణామంచేసి హృదయంలో శ్రీమన్నారాయణుని భావన చేసి గురువుకు కుడివైపుగా కూర్చుండి గురువువైపు తిరిగి అభిముఖంగా గంధమూ అక్షంతలూ పుష్పములతో గురుపాదములను పూజించి తనకు

గురువు ఒక్కొక్కటే చెప్పగా 'ఋషి, ఛందస్సు, న్యాస, ధ్యాన, మూల మంత్రజపఉచ్చారణ విధితోసహా మూడు (3) సార్లు గురువు కుడిచెవి లో ఉపదేశించగా శిష్యుడు దాన్ని తిరిగి ఉచ్చరించాలి యధాతథంగా. ఆతరువాత గురువుకు ప్రేమపూర్వకమైన భక్తితో విధివత్తుగా నమస్క రించి మంత్రమును 116 సార్లుగాని లేక అంతకంటే అధికంగాగాని భక్తినిర్భరభావంతో వినమ్రమూర్తిగా జపించాలి. ఆతరువాత మంత్ర హోమాదులను గురుసన్నిధిలో యధావిధిగాచేసి యధాశక్తి మూల మంత్రాన్ని 108 గాని సహస్రంగాని తన శక్త్యానుసారం హోమం, పూర్ణా హుతి, తర్పణలుచేసి బ్రాహ్మణభోజనం పుష్పాంజలి మంత్రపుష్పంతో పూర్తిచేయాలి!

## మంత్రోపదేశం గురువుచేసే విధానం : (విధి)

శిష్యునకు మంత్రోపదేశం ఈక్రిందివిధంగా యివ్వాలి! గురువు శిష్యుని యధావిధిగా తనవద్ద కూర్చుండబెట్టుకుని తాను ప్రణవ సహితంగా ప్రాణాయామాన్ని ఏకదీక్షతోచేసి — తన గురువును భక్తితో ధ్యానించి, నమస్కరించి, శిష్యుని శిరస్సుపై తన అమృతహస్తమును ఉంచి (తన కుడిచేతిలో అమృతకళను న్యాసంచేసి) శిష్యుని శిరస్సుపై ఉంచాలి.

ఈవిధంగా అమృతహస్తాన్ని శిష్యుని శిరస్సుపైవుంచి తన హృద యంలో ప్రణవము, మాతృక, భువనేశ్వరీన్యాసపూర్వకంగా విఘ్నేశ్వర, సరస్వతీ మూలమంత్రాలను న్యాసంచేసుకుని కేవల కుంభకంగా ప్రాణా యామాన్ని నిలిపి, తన హృదయంలో మంత్రమూర్తియైన దేవతను వెలుగుతున్న జ్యోతిలాగ భావించి, ఒకదీపంతో ఇంకొదీపాన్ని వెలిగిస్తు

నట్లుగా భావిస్తూ తన హృదయంలోని మంత్రదేవతామూర్తిని శిష్యుని హృదయంలోకి ప్రాణశ్వాసమాత్రంగా ప్రవేశపెట్టాలి.

ఈ సమయంలో పూర్తి గురుభక్తితో గురువును ధ్యానిస్తున్న శిష్యుని కుడిచెవిలో మంత్రమును మూడుసార్లు ఉపదేశించి (ఒక్కొక్కసారి గురువు చెప్పగా శిష్యుడు తిరిగి సస్వరంగా తప్పులేకుండా ఉచ్చరించాలి) ఆపైన శిష్యునకు ఆశీర్వచనమిస్తూ "సిద్ధోస్తు!" "మంత్రసిద్ధి అగు గాక!" అని ఆశీర్వచనపూర్వకంగా ఉపదేశించాలి. స్త్రీలకు, శూద్రులకు మంత్రోపదేశంలో ప్రణవాన్ని ఉపదేశించరాదని, ఇతర తంత్రమంత్ర శాస్త్రాలను ఉపదేశించవచ్చని "ఉపదేశదీక్షావిధి"లో చెప్పబడింది.

ఇలా స్త్రీ, శూద్రులకు ఉపదేశించే సమయంలో ప్రణవం లేక ఓంకారం ఉండవలసిన స్థానంలో 'ఏ'కారము అక్షరము 14 అక్షరముల కాలం దీర్ఘంగా ఉచ్చరించి ఉపదేశించాలి! ఇది గురువు ఉపదేశ దీక్షలో పాటించవల్సిన విధి.



# 9

# మంత్ర-ముహూర్తం నిర్ణయము

చైత్రాది 12-మాసములలోనూ మంత్రోపదేశం పొందితే ఏ మాసము ఏ ఫలితాన్నిస్తుందో ప్రపంచ-సార సారసంగ్రహము అన్న మహద్గ్రంథంలో శ్రీగీర్వాణేంద్ర సరస్వతిస్వామివారు, ఈక్రింది విధంగా వర్ణించారు.

1. అసిద్ధి (సిద్ధి కలగకపోవడం)
2. భూసంపత్తి
3. మరణం
4. బంధునాశనం
5. శుభప్రాప్తి
6. స్థాననాశనం
7. సంపద
8. రత్నాది ధనధాన్యసంపద
9. జ్ఞానప్రాప్తి
10. జ్ఞాననాశనం
11. ఆయుర్-వృద్ధి సంపద.
12. వశీకరణము (మంత్రవశము)

పైనచెప్పిన 12 ఫలితాలు చైత్రాది 12 మాసాలలో మంత్రోపదేశం పొందితే కలుగుతాయి.

అలానే **వారఫలము** మంత్రోపదేశానికి చెప్పబడింది.

1. సోమవారంలో ధనసంపద, ధనక్షేమము.

2. శుక్రవారంలో సాధకునికి క్షేమము.

అలానే నక్షత్రం కూడా.

1. మైత్రనక్షత్రంలో లేక పరమమైత్ర నక్షత్రంలో తన జన్మనక్షత్రం నుండి 8, 9 నక్షత్రములలో మంత్రం శ్రేష్టమైన ఫలితాన్నిస్తుంది.

పైనచెప్పినట్టు చైత్రాది మాసాలకు ఫలితమున్నట్టుగానే సూర్యుడున్నరాశినిబట్టి మంత్రోపదేశ ఫలితాలు ఈవిధంగా చెప్పబడివున్నాయి.

1. మేషరాశిలో సూర్యుడుంటే ప్రతాపమునిస్తాడు.
2. వృషభంలో సుఖవంతుడౌతాడు.
3. మిధునంలో రిక్తహస్తము (చేతిలో చిల్లిగవ్వ వుండదు).
4. కర్కాటక మాసంలో దుఃఖవంతుడవుతాడు.
5. సింహమాసంలో సర్వసమృద్ధి కలుగుతుంది.
6. కన్యామాసంలో జపించిన మంత్రం **వెంటనే సిద్ధిస్తుంది.**
7. తులామాసంలో లాభం కలుగుతుంది.
8. వృశ్చికంలో వికటమైన లక్షణాలు కలుగుతాయి.
9. ధనుర్మాసంలో సౌభాగ్యము.
10. మకరసంక్రాంతిలో ధనవంతుడవుతాడు.
11. కుంభమాసంలో ఆయుర్వృద్ధి.
12. మీనమాసంలో రాజ్యలాభము.

పై ఫలితాలు ప్రపంచసార సారసంగ్రహంలో చెప్పబడ్డాయి.

**మంత్రోపదేశ నక్షత్రాలు :**

మంత్రోపదేశానికి పరమ శుభమైన నక్షత్రాలు ఈక్రింద చెప్పబడ్డాయి.

1. అశ్వని, రోహిణి, ఆర్ద్ర, పుష్యమి, ఉత్తరఫల్గుణి, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర — అలాగే హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, విశాఖ, ధనిష్ఠ, పునర్వసు, రేవతి, నక్షత్రాలు మంత్రదీక్షను తీసుకోవడానికి శుభమైనవి.

**శుభతిధులు :**

మంత్రదీక్షకు శుభమైన తిధులు కూడా చెప్పబడ్డాయి. అవి ఏవంటే

1. పూర్ణిమ, 2. పంచమి, 3. ద్వితీయ (విదియ), 4. సప్తమి, 5. త్రయోదశి (శుద్ధ), 6. దశమి (శుక్లదశమి). మంత్రస్వీకారమునకు ప్రశస్తమైన తిధులు.

**వ్యతిరేక తిధులు :**

షష్ఠి సర్వత్రా విసర్జించవలసిన తిధి. తృతీయ — అనుకూల తిధి.

**రాశిఫలము :** (అనగా ఉపదేశము పొందేనాటి రాశియొక్క ఫలితము)

మేషంలో ధనధాన్యప్రదము.

వృషభంలో మరణము.

మిధునంలో సంతాన నాశనం.

కర్కాటకంలో సర్వసిద్ధి.

సింహంలో బుద్ధి వినాశనం.

కన్యలో మహాలక్ష్మి భాగ్యప్రదం.

తులలో సర్వసిద్ధులు.

వృశ్చికంలో పూర్ణసిద్ధి.

ధనుస్సులో జ్ఞానవినాశనం.

మకరంలో సంతానం కలుగుతుంది.

కుంభంలో ధనధాన్య సంవృద్ధి.

మీనంలో దుఃఖం కలుగుతుంది.

ఈవిధంగా పన్నెండు రాసులలో చేసే ఉపదేశానికీ రాశిఫలితాలు చెప్పబడినాయి.

**శుభయోగములు :**

పంచాంగంలో తిథి, వార నక్షత్రములతోపాటు, **యోగం** – కరణం కూడా వ్రాస్తారు.

అందులో — ఆయుష్మాన్ యోగం — సౌభాగ్యప్రదం, శుభకరం, **శోభనం** — శుభమైనది **హర్షణ**యోగం — త్వరలోనే మంత్రసిద్ధినిస్తుంది! 'వరీయాన్' యోగం — శివమంత్రాలకు సిద్ధి.

**సిద్ధయోగం** — బ్రహ్మ ఇంద్ర విష్ణుమంత్రములకు సిద్ధి కలుగుతుంది.

**పక్ష నిర్ణయము :**

మంత్రనిర్ణయము శుక్లపక్షంలో చేయవచ్చు. కొన్ని ప్రత్యేక పక్షములలో బహుళపక్షంలో చేయవచ్చు. శ్రేష్టమైన చంద్రునితో కూడితే అలానే తిథులతో ద్వాదశిలో ఒక్కొక్కప్పుడు చేయవచ్చు. త్రయోదశి మేలు. చతుర్దశిలో ఉపదేశము వాన — ప్రళయకలహము. గ్రహణ సమయములందు మంత్రదీక్ష తీసుకుంటే దరిద్రుడుగా 7 జన్మలు కర్మ అనుభవించాలి.

**కాలబలము :**

మంత్రోపదేశమునకు ప్రాతఃకాలము ధర్మవృద్ధికరము. సంధ్యా కాలము రాజ్యప్రదము. మిట్టమధ్యాహ్నము సర్వసిద్ధిప్రదము. సాయం సంధ్య మధ్యమ ఫలితము. అర్ధరాత్రి మంత్రదానం నిషిద్ధము. అలానే మలమాసం లేక అధికమాసంలో మంత్రోపదేశం చేయరాదు.

**నక్షత్ర–మంత్రపరీక్ష :**

ఏ నక్షత్రములో ఏమంత్రాన్ని ఉపదేశించాలి? ఏమంత్రానికి ఏ నక్షత్రం నిషిద్ధము?

మంత్రంలో 'ర' అన్న బీజాక్షరం రెండుసార్లుంటే రేవతి నక్షత్రం. 'జ' అనేది ఒకటి, 'ల' అనేది 3, ఓ అనేది 4, 'ప' అనేది 1, 'క' అనేది 1, ర అనేది 2 సార్లు, ఒక్కసారి, 'ప్ర' రెండుసార్లు, 'య' రెండుసార్లు, వ్య ఒక్కసారి, 'రి' అన్నది రెండు, 'క' అన్నది రెండు, 'ర' అన్నది రెండు, కు అన్నది ఒక్కటి, 'తు' అన్నది రెండు, 'గొ' అన్నది 3, 'ప' అనేది ఒక్కటి, 'ల' అనేది 3, 'క' అనేది ఒక్కటి, 'కు' ఒక్కటి, 'టి' ఒక్కటి, 'ప్ర' అన్నవి 2, 'య' అన్నది 1, 'భు' రెండు, 'ల' అన్నవి 3, 'వ' అనేది 4.

మంత్రంలోని బీజాక్షరములకు — ఒక్కొక్క నక్షత్రమునకు ఆధి పత్యము కలదు. అవి ఈక్రింద తెలుపబడిన ఈ ఆధిపత్యములు మంత్రాక్షరములకు ఉపదేశం పొందే శిష్యుని పేరులోని అక్షరమునకు అనుకూలమా, కాదా తెలుస్తుంది. జన్మ నక్షత్రం మొదలుగా —

1. జన్మ 2. సంపత్, 3. విపత్, 4. క్షేమ, 5. ప్రత్యక్, 6. సాధక, 7. మృత్యు, 8. మైత్రి, 9. పరమమైత్రి.

జన్మ, సంపత్, విపత్, క్షేమ ప్రత్యక్తారలలో జరిగిన మంత్రోప దేశం మృత్యుప్రదం. మిత్ర, పరమ మిత్రతారలు ఉపదేశానికి శ్రేష్ఠం.

తన జన్మనక్షత్రం మొదలుగా పరిశీలించి ఈ నక్షత్ర ఫలితాలను ఆ నక్షత్రానికి సంబంధించిన బీజాక్షరములను లేక మంత్రాక్షరములను పరిశీలించుకోవచ్చు! ఏ నక్షత్రానికి ఏ బీజాక్షరం ఆధిపత్యమో ఈక్రింది పట్టికలో చూపబడింది.

| నెం. | నక్షత్రములు | బీజాక్షరములు |
|---|---|---|
| 1. | అశ్విని | అ, ఆ |
| 2. | భరణి | హ |
| 3. | కృత్తిక | ఇ, ఉ, ఊ |
| 4. | రోహిణి | ఋ, ఋూ, |
| 5. | మృగశిర | ఎ |
| 6. | ఆర్ద్ర | ఏ |
| 7. | పునర్వసు | ఒ, ఔ |
| 8. | పుష్యమి | క |
| 9. | ఆశ్లేష | ఖ, గ |
| 10. | మఖ | ఘ, ఙ |
| 11. | పుబ్బ (పూర్వ ఫలునీ) | చ |
| 12. | ఉత్తర | ఛ, జ |
| 13. | హస్త | ఝ, ౹త్ర |
| 14. | చిత్త | ట, ఠ |

| నెం. | నక్షత్రములు | బీజాక్షరములు |
|---|---|---|
| 15. | స్వాతి | డ |
| 16. | విశాఖ | ఢ, ణ |
| 17. | అనూరాధ | త, థ, ద |
| 18. | జేష్ఠ | ఘ |
| 19. | మూల | న, ప, ఫ |
| 20. | పూర్వాషాఢ | బ |
| 21. | ఉత్తరాషాఢ | భ |
| 22. | శ్రవణం | మ |
| 23. | ధనిష్ఠ | య, ర |
| 24. | శతభిషం | ల |
| 25. | పూర్వాభాద్ర | వ, శ |
| 26. | ఉత్తరాభాద్ర | ష, స, హ |
| 27. | రేవతి | ళ, క్ష, అం, అః |



10

# మంత్రపురశ్చరణ విధి

**త్రతస్థానాది నియమ ఉచ్యతే :**

పర్వతాగ్రే నదీతీరే బిల్వమూలే జలాశయే ।
గోష్ఠే దేవాలయే అశ్వద్ధే ఉద్యానే తులసీవనే ॥

పుణ్యక్షేత్రే గురోః పార్శ్వే చిత్తైకాగ్రయస్థలోపివా ।
పురశ్చరణ కృన్మంత్రే సిద్ధయత్యేవ నసంశయః ॥

క్షీరాహారీ ఫలాశీ వా శాకాశీ వా హవిష్యభుక్ ।
భిక్షాశీ వా భవేద్వాథ కృచ్ఛ్రచాంద్రాయణాదికృత్ ॥

లవణం చారనాళంచ గృంజనం కాంస్యభోజనం ।
తాంబూలం చ ద్విభుక్తం చ దుస్సంవాసం ప్రమత్తతాం ॥

శృతిస్మృతి విరోధంచ జపంరాత్రౌతు వర్జయేత్ ।
భూశయ్యా బ్రహ్మచారిత్వం మౌనచర్యాఽనుసూయతా ॥

నిత్యం త్రిషవణస్నానం క్షుద్రకర్మ వివర్జనం ।
నిత్యపూజా నిత్యదానం దేవతా స్తుతికీర్తనం ॥

నైమిత్తికార్చనం చైవ విశ్వాసో గురు దేవయోః ।

నైమిత్తికార్చనం సంక్రాత్యాదిషు పూజనం ।
జపనిష్ఠా ద్వాదశైతే యమాస్యుర్మంత్ర సిద్ధిదా ॥

నిత్యం సూర్యముపస్థాయ తస్య చాభిముఖోజపేత్ ।
దేవతా ప్రతిమాదౌవా వహ్నౌవాభ్యర్చ్య తన్ముఖః ॥

అనిర్వేదస్థా వ్యగ్రః శాస్త్రోక్తచార పాలకః ।
స్నాన పూజా జపధ్యాన హోమతర్పణతత్పరః ॥

నిష్కామో దేవతాయాంచ సర్వ కర్మ నివేదకః ।
ఏవ మాదీంశ్చ నియమాన్ పురశ్చరణ కృచ్చరేత్ ॥

**జపార్థం కూర్మముఖ పరిజ్ఞానం.**

యదిగ్రామే జపేన్మంత్రీ తత్రకూర్మం విరచ్యచ ।
సిద్యర్థం తన్ముఖే తిష్టేత్ తత్కూర్మకృతిరుచ్యతే ॥

కూర్మస్యాంగాని చాష్ట స్యూర్ముఖం హస్తౌచ పార్శ్వకౌ ।
పాదౌ పృచ్ఛమితి ప్రోక్తం ప్రశస్తం ముఖమేవతు ॥

స్వరద్వంద్వం క్రమాద్దిక్షు పూర్వాదిష్వష్టసు న్యసేత్ ।
తథా కాదిన్సప్తవర్గాన్ న్యసేత్ శైవదిశం వినా ॥

గ్రామనామాద్య వర్ణస్తు యస్యాం దిశిచ తిష్టతి ।
తత్ర కూర్మముఖం జ్ఞేయం అన్యాంగానీతరత్ర చ ॥
ముఖేన తత్ఫలం వింధాతు కరయోరల్పకం ఫలం

నైష్ఫల్యం పాదయోర్మధ్యే త్వౌదాసీన్యంతు పార్శ్వయోః ।
వధబంధన దుఃఖాని పుచ్ఛదేశే భవంతి హి ॥

ఇత్యం జ్ఞాత్వా కూర్మచక్రం తత్తకర్మాణి సాధయేత్ ।
ఆసనస్థో జపేత్సమ్యక్ మంత్రార్థ గతమానసః ॥

## హోమసామాన్యవిధి :

అధహోమ సామాన్య విధిం విఘ్నేశకల్పోక్త ప్రకారేణవక్ష్యే
వివిక్తే రుచిరేరమ్యే సుఖాసీనః సమాహితః ।
ఆత్మాన మాత్మనాధ్యాత్వా జపహోమాదికాః క్రియాః ॥

స్వగృహోక్త విధానేన అగ్నిం ప్రజ్వాల్య దేశికః ।
కుండేవా స్థండిలే వాపి బ్రాహ్మణౌరథవాస్వయం ॥

జాపాసనే యది స్వార్థ మితరేషాం తులౌకికే ।

## త్రయంబక కల్పే :

తత్ర కృత్వా ऽऽ జ్యభాగాంతం సర్వముల్లేఖనాదికం ।
స్వగృహోక్త విధానేన తతోహోమం సమాచరేత్ ॥ ఇతి ॥
స్వగృహోక్తోతి । ఆచార్యస్య కర్తుర్వేతి వికల్పః ।
ధన్వంతరీ విధానే ఉక్తం ।

అగ్ని ముఖాది మఖిలం స్వచరణ విహితక్రమేణ కృత్వాగ్నైః
ఆవాహ వైద్యనాథం పరివారయుక్తం ప్రపూజ్య గంధాద్యైః ॥ఇతి॥

**అస్మిన్నేవశాస్త్రేప్రాక్ దీక్షాపటలే ఉక్తం —**

తత్రాథో సద్భృతుమతీమతీంద్రియాభాం
సంస్మృత్వా సకలజగన్మయీాం చ శక్తిం ।
తద్యోనౌ మణిభవ మారణ్యేకం వా
తారేణ క్షిపతు గృహోద్ధమేవ వాగ్నిం ॥

**చిత్పింగళ హనహన దహదహ పచపచసర్వజ్ఞ ఆజ్ఞాపయస్వాహా ॥**

అనేన అనలం జ్వలయేత్

అగ్నిం ప్రజ్వాలితం వందే జాతవేదం హుతాశనం ।
సువర్ణవర్ణమనలం సమిద్ధం సర్వతోముఖం ॥

అనేన జ్వలితం మంత్రేణోపతిష్ఠేద్వ్ధుతాశనం ।
తతః ప్రావిన్యసేద్దేహే జిహ్వాం మంత్రౌ విభావసోః ॥

సలింగ గుదమూర్ధాస్య నాసనేషుచ క్రమాత్ ।
సర్వాంగేషు చ జిహ్వాయ వక్ష్యంతే త్రివిధాత్మికా ॥

హిరణ్యా కనకా రక్తా కృష్ణా చైవతు సుప్రభా ।
బహురూపా ఽ తిరిక్తా చ జిహ్వా స్సప్తోతి సాత్వికాః ॥

పద్మరాగా సువర్ణాచ తృతీయా భద్రలోహితా ।
లోహితాఖ్యా తథా శ్వేతా ధూమినీ స కరాలికా ॥
రాజస్యః కథితా జిహ్వాః క్రమాత్కల్యాణరేతసః ।

విశ్వమూర్తి స్ఫులింగిన్యౌ ధూమ్రవర్ణా మనోజవా ।
లోహితాచ కరాళాఖ్యా కాళీ తామసజిహ్వికా ॥

అనలేరార్ధి బింద్వంతాః సాదియాతాక్షరాన్వితా ।
సాత్త్వికా దివ్య పూజాసు రాజసా కామ్యకర్మసు ॥

తామసాః క్రూరకార్యేషు ప్రయోక్తవ్యా విపశ్చితా ।
సురాస్సపిత్రు గంధర్వా యక్షనాగాః పిశాచకాః ॥

రాక్షసాశ్చ క్రమాదగ్నే రాశ్రితా రసనాస్వమీ ।
జిహ్వాసు త్రిదశాదీనాం తత్తత్కార్య సమాప్తయే ॥

జుహూయాద్వాంఛితాం సిద్ధిం దద్యుస్తాదేవతామతాః ।
స్వనామ సధృశాకారాః ప్రాయోజిహ్వా హవిర్భుజః ॥

## రామకల్పాంతర సర్వాశ్చ దేవతాయంత్ర పూజావిధి :

యంత్రం మంత్రమయం ప్రోక్తం మంత్రాత్మా దేవతేరితా ।
పురా భగవతాయుక్తం తంత్రే సంమోహనాహ్వాయే ॥
దేహాత్మనోర్యథాఽభేదో మంత్ర దేవత యో స్తథా ।
తస్మాత్పీఠే మహాయంత్రం లిఖిత్వా తత్రపూజయేత్ ॥
వినా యంత్రేణ చేత్పూజా దేవతా న ప్రసీదతి ।
క్రమదీపికాయా మవ్యేద మేదోక్తంః

సాలగ్రామే మణౌ యంత్రే మండలే ప్రతిమాసు వా ।
నిత్యం పూజా హరేః కార్యానతు కేవలకే తలే ॥

తస్మాద్యంత్రప్రకారో లిఖ్యతే

వ్యోమావిస్సచతుర్దశ స్వరవిసర్గార్ణ స్ఫురత్కర్ణికం ।
కింజల్కా లిఖితా స్వరం ప్రతిదల పారాబ్దవర్గాష్టకం ॥

క్ష్మా బింబేనచ సప్తమార్ణవ్యజాశ్రాసుసంవేష్టితం ।
వర్ణాబ్జం శిరసి స్మృతం విషగదప్రధ్వంసి మృత్యుంజయం ॥

## సకలదేవతా సమర్చనా సాధారణపీఠ పూజావిధానం :

గుం గురుభ్యోనమః గం గణపతయేనమః ఇతిపీఠస్య దక్షిణ వామయో సమభ్యర్చ్య, ఆధారశక్త్యై, మూలప్రకృత్యై ఆదికూర్మాయ అనంతాయ పృధివ్యైక్షీరసముద్రాయ శ్వేతద్వీపాయ రత్నమండపాయ కల్పవృక్షాయ శ్వేతచ్ఛత్రాయ సితచామరాభ్యాం రత్నసింహాసనాయ ఇత్యేతైరాధారశక్తయాదిభిః రత్నసింహాసనాంతైర్మంత్రైః నమోంతై సర్వాధస్తాదారభ్య ఉపర్యుపరి క్రమేణ పీఠమధ్యే సమర్చయేత్ । తత్ర విఘ్నేశ విషయే చేతు క్షీరసముద్రస్థానే ఇక్షుసముద్రాయేతి యోజయేత్ శైవాది విషయే తదుభయం నాస్తి । పునరపికేవల వైష్ణవ విషయే, శ్వేతద్వీపాయేతి తత్రాప్యైశ్వర్యప్రధాన విషయే రత్నద్వీపాయేతి యోజయేత్

శైవాదివిషయే కైలాసగిరయే ఇతియోజయేత్ । పునరపి కేవల శైవాదౌ కల్పవృక్షాద్యశ్చ న సంతి । తత్రాప్యైశ్యర్య ప్రధాన విషయే చేద్యయోగ్యం యోజనీయత్ । ఇతరస్సర్వ సర్వదేవతా పీఠార్చనేపి తుల్యమేవ ।
పునః, ధర్మాయనమః జ్ఞానాయనమః వైరాగ్యాయనమః ఐశ్వర్యాయనమః ఇత్యేతాన్పీఠపాదరూపాన్ పీఠస్య ఆగ్నేయాదికోణేషు సమర్చయేత్ । తత్రకల్పాంతరమతే

ధర్మకందాయనమః జ్ఞానానలాయనమః వైరాగ్యకర్ణికాయైనమః
ఐశ్వర్యదళేభ్యోనమః ఇత్యేతస్మిన్మతే ఉపర్యుపరి
కందాదీన్ యథోచితస్థానేషు సమర్చయేత్ ।
పున రధర్మాయ, అజ్ఞానాయ, అవైరాగ్యాయ, అనైశ్వర్యాయ
ఇత్యేతాన్పీఠస్య ఫలకరూపాన్ ప్రాగదిదిక్షు సమర్చయేత్ ॥
సం సుంతవ్య రం రజసే తం తమసే మం మాయాయై
విం విద్యాయై అం అనంతాయ పం పద్మాయ
అం సూర్యమండలాయ ఉం సోమమండలాయ
మం వహ్నిమండలాయ అం ఆత్మనే ఉం అంతరాత్మనే
మం పరమాత్మనే ఓం హ్రీం జ్ఞానాత్మనేనమః ॥
సం సత్వాయేత్యాద్యైః జ్ఞానాత్మనేనమః ఇత్యంతై రాస్తరణ
రూపైర్మంత్రైః తత్రవైష్ణవ పూజాయాం పీఠమధ్యే సమర్చయేత్
తత్ర వైష్ణవ పూజాయాం (మధ్యే) అనంతః
పునర్మధ్యే అష్టదళపద్మం సంచింత్య ప్రాగాదిదళేషు
కర్ణికాయాంచ నవశక్త్యశ్చ ఆసనమంత్రదేవతాశ్చ
సమర్చనీయా । క్వచిత్క్వచిత్ ఆసనమంత్రోనాస్తి
తత్రసర్వత్ర కేవలపద్మే సమర్చయేత్ । ఇతర పీఠమంత్రా
స్సర్వత్ర సమానా ఏవ । అయమేవ సర్వదేవతావిషయేఽ పి
పీఠార్చనాన్యాయః । తత్రతు నవశక్త్యాసనమంత్రాణమేవ
సర్వత్ర విశేషః ఇతరస్సర్వం సకలదేవతాపూజావిషయేఽ పి
తుల్యమేవ । తత్రతు వైష్ణవే పీఠే సమర్చయేదిత్యుక్తే
తన్నవశక్త్యాసన మంత్రా ఏవ బివక్షితాః । తథాదార్గే
వైనాయకే సౌరాదౌ సారస్వతేచ ॥

అథ పునరత్ర మాతృకాయా నవశక్తయ ఉచ్యంతే —
మేధాయై, ప్రజ్ఞాయై, ప్రభాయై, విద్యాయై, ధియై, ధృత్యై
స్మృత్యై, బుద్ధ్యై, విద్యేశ్వర్యై ఇతి నవశక్తయః ।
"ఓం హ్రీం స్వర్ణబీజాయ సారస్వత్యాసనాయనమః"
ఇతి పీఠమంత్రః ఏతాసు అష్టసుకేసరేషు
అష్టౌశక్తయః । నవమీ తు కర్ణికాయాం దేవతాస్థానే
ఏవమేవ సర్వత్ర నవశక్తి స్థానాని, ఆసనమంత్రశ్చ కర్ణికాయామేవ ॥
ఇత్థం పీఠం సంపూజ్య, అస్మిన్మాతృకాసరస్వతీ
మూలమంత్రేణ సమావాహ్య ఆవరణైస్సహసమర్చయేత్ ।
ప్రథమం మాతృకాషడంగైః ప్రథమావరణే కేసరేషు సమర్చయేత్ ।
తత్ప్రకారస్తు తత్ర తత్రాంగన్యాసే ఉక్తం మంత్రముచ్చార్య
హృదయాయనమః శిరసేనమః, శిఖాయైనమః, కవచాయనమః
నేత్రాభ్యాంనమః అస్త్రాయనమః ఇత్యేవం ప్రకారేణ
చతుర్థం తత్వేన సమర్చయేత్ । సర్వత్రాంగర్చనావిధావేవ
మేవన్యాసః । తత్రహృదయాది చతుష్టయమాగ్నేయాదికోణ
చతుష్టయ కేసరేషు, పురతో నేత్రం, చతుస్రుషు
దిక్షు అస్త్రం సమర్చయేత్ । క్వచిత్ క్వచిత్ అన్యధా ।
పూర్వాది దిక్షు హృదయాది విదిక్షు అస్త్రం । యధావరాహాది
విధానే । తంత్ర సముచ్చేతు శైవే ఆగ్నేయేశాన్య
నైఋత్యాదిషు హృదయాది । వైష్ణవే ప్రాగదీతి విశేష ఉక్తః ।
అంగవృత్తౌ సర్వత్రైవమేవ స్థాన నియమః । తదుక్తం
చాస్మిన్నేవ ప్రపంచసారే ప్రాగదీక్షాపటరే —

హృదయాద్యాశ్రిషు పురతో నేత్రం దిశాం క్రమాత్పున
రస్త్రం చ సమర్చయే దితి । పునరేతసామంగదేవతానాం
రోచీంషి ఉచ్యతే ।

హార స్ఫటికకళా యాంజన పింగళ వహ్నిరోచిషో లలనాః ।
అభయ వరోద్యత హస్తాః ప్రధాన తనవోఽ ంగదేవతాకథితాః ॥



11

# మంత్రశాస్త్ర ప్రయోగము

మంత్రశాస్త్రంలో ఉపయోగాలను అనుసరించి మంత్రాలను — 1) మోక్ష మంత్రములు, 2) సంపదనిచ్చే మంత్రములు, 3) కామ్యక మంత్రములు (కోరికలను ప్రసాదించేవి), 4) జాతకంలోని గ్రహదోష నివారణ మంత్రములు, 5) రక్షణ మంత్రములు, 6) జ్ఞానప్రదములు 7) భోగమోక్షప్రద మంత్రములుగా ప్రయోగం ప్రకారము — మంత్రములు ఏడు విభాగములుగా చెప్పబడినవి.

## 1) మోక్షమంత్రములు :

మానవజన్మ సాఫల్యానికి, జన్మలక్ష్యమైన మోక్షసాధనకు ఉపయోగించేవి ఈ మంత్రాలు. శ్రీమదష్టాక్షరీ మహామంత్రము, గాయత్రీ మహా

మంత్రమువంటివి ఈ కోవలోనివి. ఇవి పరమార్థాన్ని అర్థించి అర్తితో చేసే సాధకులకై నిర్దేశించినవి.

**2) కామ్యక మంత్రములు :**

మనిషికి జీవితంలో విద్య, వివాహము, సత్సంతానము కోరి అవి గతజన్మలోని కర్మదోషాలవల్ల సిద్ధించటం ఆలశ్యం లేదా అసంభవం అయితే అలాంటివి సంపాదించుకోవడానికి ఈ కామ్యక మంత్రాలు ధర్మబద్ధమైన కోరికలకై చేసే మంత్రాలు.

'కామ్యకము' అనగా **కోరిక** = కామమును ఇచ్చేవి. వీటిలో విఘ్న నివారణకు (గణపతిమంత్రము) విష నివారణకు (గరుడ మంత్రము), ధన్వంతరీ మంత్రము (వైద్యసిద్ధికి) ఇలా అనేక మంత్రాలు మన శాస్త్రాలలో చెప్పబడ్డాయి.

**3) సంపదనిచ్చే మంత్రములు :**

కేవలం మోక్షాన్నిచ్చే మంత్రాలతో తృప్తిచెందటం సామాన్యులందరికి సాధ్యమయ్యే పనికాదు. ముక్తితోపాటు భుక్తికూడా గడవాలి కదా! అందుకని సకల సంపదలని, ధనధాన్య సమృద్ధినీ ప్రసాదించగల మంత్రాలు ఈ సంపదనిచ్చే మంత్రాలు. ఇవి భౌతికంగా మనిషి సకల సమృద్ధితో జీవితం గడపడానికి దోహదం చేసేవి.

**4) దోషనివారణా మంత్రములు :**

మనిషి గతజన్మలో సంపాదించుకున్న పుణ్యాపాపాలయొక్క ఎకౌంటే జాతకమంటే! అంటే మన పరిభాషలో అది ఓపెనింగ్‌బాలెన్స్ అన్నమాట!

మన దుష్కర్మఅంతా దోషాలరూపంలో మన జాతకంలో స్పష్టంగా కన పడుతుంది. ఆ దోషనివారణ పూర్తిగా జరిగితేగాని మనం తలపెట్టిన పనులు నెరవేరడం, మంచి ఆరోగ్యం చేకూరడం వంటివి సంప్రాప్తించవు. అందుకని జాతకంలోని గ్రహదోషాల నివారణకు ఉపకరించేవి ఈ కోవలోని మంత్రాలు.

**5) రక్షణ మంత్రాలు :**

అనేకమంది శరీర, మానసిక వత్తిళ్ళకు, శత్రువులచే ప్రయోగ బాధలకు అదిబాధలైన భూతప్రేతపిశాచ బాధలకు వాస్తుపరమైన దోషా లతో బాధపడేవారికి రక్షణ నిమిత్తం ఒక కవచంలా ఉపకరించేవి ఈ మంత్రాలు. వీటిని అనుష్టించి సిద్ధింపచేసుకొంటే అవి రక్షాకవచాలుగా పనిచేస్తాయి.

**6) జ్ఞానప్రదములు :**

జీవిత పరమార్ధంతోపాటు జ్ఞానప్రాప్తి (లౌకికమైనది కాదు) కొరకై అనుష్టానంగా ఆచరించి సత్ఫలితాలను పొందగలవి ఈరకమైన మంత్రాలు. సకల శాస్త్రాలకు ఆధారమైనటువంటి హయగ్రీవమూర్తిని ఉపాసించే హయగ్రీవమంత్రాన్ని, అష్టాదశ పురాణాలను, అష్టాదశ ఉప పురాణాలను, బ్రహ్మసూత్రాలను విరచించిన వ్యాసమహర్షి అనుగ్రహానికై వేదవ్యాసమంత్రాన్ని వీటికి ఉదాహరణగా చెప్పుకోవచ్చు!

**7. భోగమోక్షప్రద మంత్రములు :**

ఆదిమధ్యాంత రహితుడు, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు

అటువంటి వేంకటేశ్వర పరబ్రహ్మాన్ని ఉపాసనగా ఆరాధించి భోగాన్ని, మోక్షాన్నీకూడా పొందటానికి ఈ భోగమోక్షప్రద వేంకటేశ్వర ఉపాసన అందుకై ఉపాసనావిధానం ఈ విభాగంలో చెప్పబడింది.

ఇవి స్థూలంగా మన మంత్రశాస్త్ర ప్రయోగవిధి ననుసరించి పేర్కొనదగిన మంత్రముల విభాగం. వాటి వివరాలు విడిగా తెలుసుకుందాం!



12

# శ్రీమదష్టాక్షరీ మహామంత్రము

అస్యశ్రీ మదష్టాక్షర మహామంత్రస్య బదరికాశ్రమ వాసి అంతర్యామీ శ్రీమన్నారాయణ ఋషిః దైవీగాయత్రీ ఛందః పరమాత్మా భగవాన్ శ్రీమన్నారాయణో దేవతా । శ్రీ రధిష్టాన దేవతా । ఆం (ఓం) బీజం ఆయ శక్తిః మం కీలకం । శ్రీ మన్నారాయణాష్టాక్షర సిధ్యర్థ్యే జపే వినియోగః

కరన్యాసం :

| | | |
|---|---|---|
| ఓం ఓం | — | అంగుష్టాభ్యాం నమః |
| ఓం నమః | — | తర్జనీభ్యాం నమః |
| ఓం నారాయణాయ | — | మధ్యమాభ్యాం నమః |
| ఓం ఓం | — | అనామికాభ్యాం నమః |
| ఓం నమః | — | కనిష్టికాభ్యాం నమః |
| ఓం నారాయణాయ | — | కరతల కరపృష్టాభ్యాం నమః |

అంగన్యాసము :

| | | |
|---|---|---|
| ఓం ఓం | — | జ్ఞానాయ హృదయాయ నమః |
| ఓం నమః | — | ఐశ్వర్యాయ శిరసేస్వాహా |
| ఓం నారాయణాయ | — | శక్త్యై శిఖాయైవౌషట్ |
| ఓం ఓం | — | బలాయకవచాయహుం |
| ఓం నమః | — | తేజసే నేత్రాభ్యాంవషట్ |
| ఓం నారాయణాయ | — | వీర్యాయ అస్త్రాయ ఫట్ |

భూర్భువస్సువరో మితి దిగ్బంధః

అని, రెండు చేతులతో అష్టాక్షర చక్రముద్రను పట్టి, తనకు ప్రదక్షిణగా త్రిప్పి 'సుదర్శనాయ హేతిరాజాయతేనమః' అని చక్రముద్రతో మూడుసార్లు త్రిప్పిన రక్షామయమైన దిగ్బంధము అగును.

ధ్యానం :

సవ్యం పాదం ప్రసార్య, శ్రిత దురిత హరం దక్షిణం కుంచయిత్వా
జానున్యాదాయ సవ్యేతర మితరభుజే, నాగభోగే నిధాయ
పశ్చాద్బాహుభ్యాం ప్రతిభట శమనే ధారయన్,
శంఖచక్రౌ దైవీ భూషాదిజుష్టో
జనయతు జగతాంశర్మ వైకుంఠ నాథః

మూలమంత్రము :

ఓం నమో నారాయణాయ (108 సార్లు)



13

# నారాయణ అష్టాక్షరీ మంత్రము

అస్యశ్రీ నారాయణ అష్టాక్షరీ మహామంత్రస్య సాధ్యనారాయణ ఋషిః।
దైవీగాయత్రీ ఛందః। అంతర్యామీ నారాయణః పరమాత్మా దేవతా।
ఓం బీజం నారాయణాయేతి శక్తిః। నమః కీలకం। జపే వినియోగః

కరన్యాసం :

ఓం క్రుద్ధోల్కాయ స్వాహా — అంగుష్ఠాభ్యాం నమః
ఓం మహోల్కాయ స్వాహా — తర్జనీభ్యాం నమః
ఓం వీరోల్కాయ స్వాహా — మధ్యమాభ్యాం నమః
ఓం ద్యుల్కాయ స్వాహా — అనామికాభ్యాం నమః
ఓం సహస్రోల్కాయ స్వాహా — కనిష్ఠికాభ్యాం నమః

అంగన్యాసము :

ఓం క్రుద్ధోల్కాయ స్వాహా — జ్ఞానాయ హృదయాయ నమః
ఓం మహోల్కాయ స్వాహా — ఐశ్వర్యాయ శిరసేస్వాహా

ఓం వీరోల్కాయ స్వాహా — శక్త్యై శిఖాయైవౌషట్

ఓం ద్యుల్కాయ స్వాహా — బలాయకవచాయహుం

ఓం సహస్రోల్కాయ స్వాహా — వీర్యాయ అస్త్రాయ ఫట్

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

ధ్యానం :

ఉద్యత్కోటి దివాకరాభ మనిశం శంఖంగదా పంకజం
చక్రం భిభ్రత మిందిరా వసుమతీ సంశోభిపార్శ్వద్వయం ।
కిరీటాంగదహార కుండలధరం పీతాంబరం కౌస్తుభో
ద్దీప్తం విశ్వధరం స్వవక్షసి లసచ్ఛ్రీవత్సచిహ్నాం భజే ॥

మూలమంత్రము :

ఓం నమో నారాయణాయ

## 14

# గాయత్రీ మహామంత్రము

అస్యశ్రీ గాయత్రీ మహామంత్రస్య విశ్వామిత్ర ఋషిః గాయత్రీ ఛందః । శ్రీసవితాదేవతా । యం బీజం । ఈం శక్తిః । ఐం కీలకం । మమ ఉపాత్త సమస్త దురితక్షయార్ధే భగవదనుగ్రహ సిద్యర్ధే జపేవినియోగః

కరన్యాసం :

| | | | |
|---|---|---|---|
| ఓం తత్సవితుః | — | బ్రహ్మాత్మనే | అంగుష్టాభ్యాం నమః |
| వరేణ్యం | — | విష్ణ్వాత్మనే | తర్జనీభ్యాం నమః |
| భర్గోదేవస్య | — | రుద్రాత్మనే | మధ్యమాభ్యాం నమః |
| ధీమహి | — | సత్యాత్మనే | అనామికాభ్యాం నమః |
| ధియోయోనః | — | జ్ఞానాత్మనే | కనిష్టికాభ్యాం నమః |
| ప్రచోదయాత్ | — | సర్వాత్మనే | కరతల కరపృష్టాభ్యాం నమః |

అంగన్యాసము :

| | | | |
|---|---|---|---|
| ఓం తత్సవితుః | — | బ్రహ్మాత్మనే | హృదయాయ నమః |

| | | | |
|---|---|---|---|
| వరేణ్యం | — | విష్ణ్వాత్మనే | శిరసేస్వాహా |
| భర్గోదేవస్య | — | రుద్రాత్మనే | శిఖాయైవషట్ |
| ధీమహి | — | సత్యాత్మనే | బలాయ కవచాయ హు |
| ధియోయోనః | — | జ్ఞానాత్మనే | తేజసేనేత్రాభ్యాంవౌషట |
| ప్రచోదయాత్ | — | సర్వాత్మనే | వీర్యాయ అస్త్రాయఫట |

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

ధ్యానం :

ముక్తా విద్రుమ హేమనీల ధవళచ్ఛాయైః ముఖైస్త్రీక్షణై
యుక్తా మిందు నిబద్ధరత్న మకుటాం తత్వార్ధ వర్ణాత్మికాం
గాయత్రీం వరదా భయాంకుశకశార శుభ్రం కపాలం గదాం
శంఖంచక్ర మధారవిందయుగళం హస్తైర్వహంతీం భజే ।

మూలమంత్రము :

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్

15

# వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రము

శ్రీ మద్ద్వాదశాక్షరీ మహామంత్రస్య । ప్రజాపతి ఋషిః । గాయత్రీ ఛందః పరమాత్మా వాసుదేవో దేవతాః । అం బీజం । శ్రీం శక్తిః । నమః కీలకం భగవత్ప్రీత్యర్థే జపే వినియోగః

కరన్యాసం :

ఓం ఓం — అంగుష్టాభ్యాం నమః

ఓం నమః — తర్జనీభ్యాం నమః

ఓం భగవతే — మధ్యమాభ్యాం నమః

ఓం వాసుదేవాయ — అనామికాభ్యాం నమః

ఓం నమో భగవతే వాసుదేవాయ — కరతలకర పుష్టాభ్యాం నమః

అంగన్యాసము :

ఓం ఓం — జ్ఞానాయ హృదయాయ నమః

ఓం నమః — ఐశ్వర్యాయ శిరసేస్వాహా

| | |
|---|---|
| ఓం భగవతే | — శక్త్యై శిఖాయైవౌషట్ |
| ఓం వాసుదేవాయ | — బలాయకవచాయహుం |
| ఓం నమో భగవతే వాసుదేవాయ | — వీర్యాయ అస్త్రాయ ఫట్ |

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

ధ్యానం :

భగవాన్ సర్వభూతస్థ సర్వభూత ప్రతిష్ఠితం

వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిం

హరిముజ్వల చక్రదరాబ్జ గదా కులదోః పరిఘం సితపద్మ గతం ।

వలయాంగదహార కిరీటధరం నవకుందరుచం ప్రణమామి సదా ॥

లం ఇత్యాది పంచపూజ గురుధ్యానం ।

మూలమంత్రము :

ఓం నమో భగవతే వాసుదేవాయ

గాయత్రి :

దామోదరాయ విద్మహే వాసుదేవాయ ధీమహి

తన్నోః కృష్ణః ప్రచోదయాత్ ।

జపసంఖ్య : 12 లక్షలు

ఫలం : మోక్షప్రదం

16

# శ్రీవిష్ణు షడక్షరీ మంత్రము

శ్రీమత్ విష్ణుషడక్షరీ మహామంత్రస్య । బ్రహ్మాఋషిః । గాయత్రీ ఛందః శ్రీమహావిష్ణుర్దేవతాః । ఓం బీజం । నమః శక్తిః । హ్రీం కీలకం శ్రీం కవచం । ఐం అస్త్రం । శ్యామోవర్ణః । శ్రీమహావిష్ణుప్రీత్యర్థే జపే వినియోగః

కరన్యాసం :

ఓం ఓం — అంగుష్టాభ్యాం నమః
ఓం నమః — తర్జనీభ్యాం నమః
ఓం విష్ణవే — మధ్యమాభ్యాం నమః
ఓం ఓం — అనామికాభ్యాం నమః
ఓం నమః — కనిష్ఠికాభ్యాం నమః
ఓం విష్ణవే — కరతలకర పృష్టాభ్యాం నమః

అంగన్యాసము :

| | | |
|---|---|---|
| ఓం ఓం | — | జ్ఞానాయ హృదయాయ నమః |
| ఓం నమః | — | ఐశ్వర్యాయ శిరసేస్వాహా |
| ఓం విష్ణవే | — | శక్త్యై శిఖాయైవౌషట్ |
| ఓం ఓం | — | బలాయకవచాయహుం |
| ఓం నమః | — | తేజసే నేత్రాభ్యాంవషట్ |
| ఓం విష్ణవే | — | వీర్యాయ అస్త్రాయ ఫట్ |

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

ధ్యానం :

శంఖు చక్ర గదా పద్మధారిణం శ్రీధరం విష్ణుం

నమామి విష్ణుం తం దేవం సర్వాభరణ భూషితం

మూలమంత్రం :

ఓం విష్ణవే నమః

గాయత్రి :

వరం విష్ణుర్వరేణి యం భర్గోయాయాచ ధీమహి

తన్నో విష్ణు ప్రచోదయాత్ ।

ద్వయమంత్రం :

శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే

శ్రీమతే నారాయణాయ నమః

చరమ మంత్రం :

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ
అహం త్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

శరణాగతి :

నారాయణ నమస్తేస్తు కరుణాత్మన్ దయానిధే
పాహిమాం కృపయాదేవ భక్తంతే భక్తవత్సలం
మమ కర్మవశాజ్జాతో నానాయోనిషు మూఢధీః
కర్మక్షయా దహం ప్రాప్తః తవపాదాబ్జ వత్తనం
అద్యప్రభృతి దాసోహం దేవదేవ జగత్పతే
జన్మమా భూజ్జగన్నాథ దేవదేవ జనార్దన
సంసారార్ణవ మగ్నస్య త్వత్రాబ్జం వినా గతిః
నాన్యదస్తి, సముద్ధర్తుం మృత్యుసంసార సాగరాత్
మదీయ ధనదారాది సర్వభారస్స మర్పితః
ఆత్మానం శేష భూతం హి తక్షమాం శరణాగతం
శరణాగతోస్మి తవాస్మి దాసఇతి వక్తారం మాంతారం

## 17

# శ్రీరామ తారకమంత్రము

అస్యశ్రీ రామతారక మహామంత్రస్య బ్రహ్మఋషిః । గాయత్రీశ్ఛందః శ్రీరామోదేవతా । రాం బీజం । నమశ్శక్తిః । రామాయేతి కీలకం । జపేవినియోగః

కరన్యాసం :

ఓం రాం — అంగుష్టాభ్యాం నమః

ఓం రీం — తర్జనీభ్యాం నమః

ఓం రూం — మధ్యమాభ్యాం నమః

ఓం రైం — అనామికాభ్యాం నమః

ఓం రౌం — కనిష్ఠికాభ్యాం నమః

ఓం రః — కరతల కరపృష్ఠాభ్యాం నమః

అంగన్యాసము :

ఓం రాం — జ్ఞానాయ హృదయాయ నమః

ఓం రీం — ఐశ్వర్యాయ శిరసేస్వాహా

ఓం రూం — శక్త్యై శిఖాయైవౌషట్

ఓం రైం — బలాయకవచాయహుం

ఓం రౌం — తేజసే నేత్రత్రయాయవౌషట్

ఓం రః — వీర్యాయ అస్త్రాయ ఫట్

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

ధ్యానం :

కాలాంభోధర కాంతికాంతమనిశం వీరాసనాధ్యాసితం
ముద్రాంజ్ఞానమయీం దధానమపరం హస్తాంబుజం జానుని
సీతాపార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యంతం మకుటాంగదాది వివిధా కల్పోజ్జ్వలాంగం భజే

మూలమంత్రము :

ఓం శ్రీం హ్రీం రాం రామాయ నమః

శ్రీరామ గాయత్రి :

ఓం శ్రీం హ్రీం క్లీం దాశరథాయ విద్మహే సీతావల్లభాయ ధీమహి
తన్నో రామచంద్ర ప్రచోదయాత్ ।

